# విషయానుక్రమణిక

## 25 అక్టోబరు 1950





# ఆంధ్రపత్రిక

సంవత్సరచందా
రు. 12-0-0
విడిపత్రిక
4 అణాలు

## ప్రతిబుధవారము
ప్రకటింపబడును

**Founder: K. NAGESWARA RAO**

సంపుటము **43**
సంచిక **7**

విక్రుతి సంవత్సర ఆశ్వయుజ శుద్ధ పూర్ణిమ బుధవారము




శ్రేయోరాజ్య స్థాపనకు!

“శ్రేయో రాజ్యాన్ని స్థాపించడానికి ప్రయత్నించేముందు మనకు పోలీసు రాజ్యం కావాలి. అలాంటి రాజ్యం శ్రేయోరాజ్యానికి సరియైన ప్రాతిపదిక” అని అన్నారు ఆచార్య కృపలానీ. —శంకర్స్ వీక్లీ

# నేటి ప్రపంచం

## సమితి నియమాలు

ఐక్యరాజ్య సమితి ప్రధాన నియమాలలో పెద్ద మార్పులు చెయ్యబడినాయి. ఈ సవరణలవల్ల సమితి యుద్ధ సంస్థగా మారగలదనీ శాంతి సాధనకు నిరుపయోగం కాగలదనీ పండిట్ నెహ్రూ హెచ్చరించారు. కాని పరిస్థితుల ప్రభావంవల్ల అమెరికన్ల చెవులకీ మాటలెక్కవు. రూజ్వెల్ట్-స్టాలిన్-చర్చిల్ సమావేశాలఫలితంగా సమితిస్థాపించబడింది. ప్రపంచంలో శాంతిని కాపాడాలంటే సైనికంగా, ఆర్థికంగా బలవత్తరమైన దేశాల మధ్య సామరస్యం అవసరమని వారు గుర్తించారు. కాబట్టి అమెరికా, రష్యా, బ్రిటన్, ఫ్రాన్స్, చీనాలలో ఏ ఒక్కరికి నచ్చని విషయాల్ని కాని మిగతా నలుగురూ బలవంతాన రుద్దకూడదనే భావంతో వీటో ఏర్పాటుచేశారు. నిజాని కిది మిగతా దేశాలపట్ల నిరాదరణ అనాలి. మిగతా దేశాల ఆమోదంతో నిమిత్తంలేకుండా కేవలం అయిదుగురు పెద్ద లనుకునేవారి ఆమోదం దొరికితే చాలు నిర్ణయాలు చేయవచ్చు ననుకున్నారు. వీటో ఏర్పాటుతోనే సమితి వ్యవహారాలలో అగ్రరాజ్యాలకూటరాజకీయాలకు ప్రాబల్యం లభించి, సమస్యల పరిష్కారంలో న్యాయాన్యాయ విచక్షణకు తావులేకుండా పోయింది.

కాని ఆనాటి సైనికబల, ఆర్థిక బల పరిస్థితుల్ని గమనించి ఈ పెద్దల పెత్తనానికి తలొగ్గక తప్పిందికాదు. అప్పటినుంచీ అంతర్జాతీయ సమస్యల పరిష్కార విధానంలో న్యాయ మనేది పరిగణించబడకుండానే నడిచిపోతున్నది. అప్పుడప్పుడు న్యాయం గమనించబడినా, లేక అగ్రరాజ్యాలవారు తాము న్యాయానికి కట్టుబడి వ్యవహరిస్తున్నట్లు దబాయించినా దానికొక హేతువుంది. వీటో ఏర్పాటులేని సమితి సర్వ సభ్య సమావేశంలో చిన్న రాజ్యాల్ని ఎవరిమట్టుకు వారు తమ పక్షాన చేర్చుకోడానికి తాపత్రయపడి తాము ధర్మమూర్తులమని ప్రచారం చేసుకుంటూ వచ్చారు. క్రమంగా ఈప్రయత్నాలు ఫలించి సమితిలో అమెరికా ప్రాబల్యం సంపాదించింది. ఏనాడో కూడగట్టుకున్న దక్షిణఅమెరికా వోట్లు 21 కీచేర్చి మార్షల్ ప్రణాళిక, అట్లాంటిక్ పాక్టులద్వారా పశ్చిమయూరప్, ఆఫ్రికాలలో దేశాలనూ, కొన్ని ఆసియా దేశాలనూ అమెరికా తన చెప్పుచేతల్లోకి తెచ్చుకుంది. అమెరికా పన్నిన ఈతంత్రంతోనే అగ్రరాజ్యాల మధ్య సామరస్యం భగ్నమయింది. అగ్రరాజ్యాలమధ్య ఏకీభావం కుదరాలనే నియమాన్ని అందరూ మరిచి పోయారు.

ఐక్యరాజ్యసమితి పేరుతో ఇతరదేశాలను అమెరికా ఏవిధంగా తన తంత్రానికి బంధిస్తున్నదీ గమనించి రష్యా ఎనిమిది మాసాల బహిష్కరణను విరమించుకొని తిరిగి ప్రవేశించింది. సమితిలో అమెరికా పన్నిన తంత్రాన్ని భేదించడం రష్యాకు ప్రధాన సమస్యగా పరిణమించింది. ఇది కనిపెట్టిన అమెరికా బ్రిటన్లు, సమితి నియమాలను సవరణచేసి, సమితిలో కల తమ సంఖ్యాపాబలంతో రష్యన్ వర్గం మెడకు ఉచ్చుపోయాలని యత్నిస్తున్నది.

ఈయత్నం రష్యాతో సఖ్యతకోసం చేస్తున్నది కాదనీ, రష్యాను బంధించడానికేననీ అందరికీ స్పష్టమే. కాని ఇదెంతవరకు కొనసాగుతుంది? తన ఉనికికి భంగం కలిగే సమయంలో రష్యాకాదు ఏదేశమూకూడా సమితి నియమాలనూ నీతి సూత్రాలనూ పాటించబోదు. వైరం ప్రపంచయుద్ధానికి దారితియ్యక మానదు. ఆ ప్రమాదాన్ని నివారించాలంటేరష్యాతో వైరం సాధించడం కాదు; రూజ్వెల్ట్ మొదట ఆశించినట్లు సామరస్యం సాధించాలి. అది సాధ్యపడని పక్షంలో సమితినిరద్దుపరచవలసిందే కాని మిగతా రాజ్యాల్ని చెప్పుచేతల్లోపెట్టుకోడానికి పరికరంగా ఉపయోగించ యత్నించడం వ్యర్థం. దానికి భారతదేశం కాదుగదా బ్రిటన్ కూడా సమ్మతించక పోవచ్చును.

ఎచిసన్ ప్లాన్ సమితిచేత ఆమోదించబడింది. దీనివల్ల భద్రతామండలి ప్రాభవం తరిగిపోయినట్లే. ఇకనుంచి భద్రతామండలి చెయ్యదగినదల్లా కాశ్మీర్ సమస్య, పాలస్తీనా సమస్యలను చర్చించడం మాత్రమే. ఈసమస్యలకు సంబంధించిన దేశాలు మాత్రమే భద్రతామండలి ఆదేశాలకు తలొగ్గాలి కాని మిగతా దేశాలు తలొగ్గవు.

సవరణల ఫలితంగా పండిట్ నెహ్రూ చెప్పినట్లు, సమితి అట్లాంటిక్ పాక్టు అన్నగారిలాగా అమెరికా చేతిఏటం బాంబులాగ తయారయినట్లె భావించవచ్చును, చీనా కమ్యూనిస్టు ప్రభుత్వాన్ని ప్రవేశపెట్టే సమస్యలో అమెరికా అవలంబించిన దౌర్జన్య విధానానికి భారతదేశం కూడా గురికావడానికి ఆట్టె కాలం పట్టక పోవచ్చును.

ఆ సమయం ఆసన్నమైనప్పుడు ఈ ప్రజాస్వామ్య నీతిబోధలూ ప్రచారాలూ మాయమై మోసపు మాటలు మాత్రమేనని స్పష్టంకాగలదు.

ఆసియా దేశాల్ని కమ్యూనిస్టు విప్లవాల బారినుండి కాపాడ్డమే అమెరికా ప్రధానాశయమని ట్రూమన్ అన్నాడు. ఆసియాలోనే కాదు యావత్ప్రపంచంలోనూ శాంతిని కాపాడే బాధ్యత అమెరికాపై ఉన్నదని ట్రూమన్ అన్నాడు. కమ్యూనిజం ఇంతటి ముప్పునో కాదో ఆసియావాసు లందరికీ తెలియదు. అమెరికావల్ల ఎంతముప్పున్నదో కూడా పూర్తిగా గ్రహించలేక పోయినా అనుమానించడానికి తగిన కారణాలు లేక పోలేదు. ఆసియాలో కమ్యూనిస్టు అరాచకోద్యమాల ముప్పు ఆయా దేశాల ప్రభుత్వాలపరిపాలనావిధానాన్నిబట్టి వుంటుంది. ప్రభుత్వాలు ప్రజల విశ్వాసాన్ని ఆర్జించుకోగలిగినట్లైతే కమ్యూనిస్టులవల్ల భయం బొత్తిగా అనవసరం. కాని ప్రభుత్వాలెంతబలమైనవైనా, ఎంతిగా ప్రజల ఆదరణను పొందినవైనా అమెరికా వ్యాపారరాజకీయాలకు కూట రాజనీతిజ్ఞతకూ తట్టుకోలేవనే విషయం రూఢి. ఇంతేకాదు. మలయా, ఇండోచీనా మొదలైన ప్రాంతాల సామ్రాజ్య వాదుల్ని దౌర్జన్య పరుల్ని బలపరిచి అమెరికా ఆసియాపట్ల ద్రోహం చేసింది. అదను లభించగానే కొరియాలో సమితి పతాక చేతబట్టి అమెరికా తన ప్రజాస్వామ్య నీతి సిద్ధాంతాలనూ ఆసియావాసులపట్ల ప్రేమ ప్రచారాలనూ గాలికి వొదిలేసి అమానుష కృత్యాలకు దిగింది. చీనా రష్యాలతో యుద్ధానికి కాలుదువ్వి మాటిమాటికీ రెచ్చగొట్ట యత్నిస్తున్నది. తియ్యని మాటల మాటున ఇంతవరకూ దాచుకున్న ద్వేషం, ఆసియావాసులపట్లకల హేయభావం కొరియాలో పైకుబికినాయి. అమెరికన్ల దౌర్జన్యం ఏ రూపంలో ఉంటుందో సాక్షాత్కారమయింది. ఆసియాలో రష్యా ఇంక వేరే ప్రచారం చెయ్యవలసిన అగత్యం లేదు.

ఈ పరిస్థితిలో ఆసియా దేశాలకు తక్షణ

ప్రమాదం తెచ్చిపెట్టగలవారు కమ్యూనిస్టులా, లేక ప్రజాస్వామ్య దౌర్జన్యవాదులా అనే సందేహం తీరడంలేదు. కాబట్టి కమ్యూనిస్టులు ఇవ్వచూపుతున్న సర్వప్రజలకూ సమాన జీవన సదుపాయాలు ఆసియావాసులలో ఆశలు కలిగించడంలో వింత లేదు.

వాస్తవానికి ఆసియా దేశాలలో కమ్యూనిస్టుల ప్రచారం ఫలిస్తున్నదంటే హేతువు కమ్యూనిస్టుల దౌర్జన్య విధానం కాదు. వారి పార్టీ ప్రచారబలమూ కాదు. ప్రభుత్వాల అసమర్థత, ఉద్యోగుల అవినీతి, వ్యాపారుల దుర్వ్యాపారం, విదేశవ్యాపారుల దుర్నీతి, ధనవంతుల విశృంఖలవర్తన, రాజకీయనాయకుల అవివేకం హేతువులు. ఇవే కమ్యూనిజానికి నిజమైన పరికరాలు.

ఈ సమస్యల్ని పరిష్కరించే బదులు అమెరికా తన సైనిక బలాన్ని ప్రయోగించి ఆసియాలోనూ యూరప్‌లోనూ కమ్యూనిజాన్ని నిరోధించ యత్నిస్తున్నది. దీనివల్ల పాశ్చాత్య నాగరికతలో లజ్జతో చాటుమాటున అణిగిఉన్న అమానుష ప్రవృత్తి ఇప్పుడు లజ్జవిడిచి విజృంభిస్తున్నది. దీనితో ఆసియా ఒక్కటే కాదు. త్వరలోనే యూరప్ కూడా పూర్తిగా చెయ్యి దాటిపోగల ప్రమాదమున్నదని అమెరికా గుర్తించలేకపోతున్నది.

## ఇండో చీనా

కొరియాలో కమ్యూనిస్టులకే కాక ప్రజలందరికీ కూడా అమెరికన్ సైనికబలం ఎలా వుంటుందో రుచిచూపబడుతున్న సమయంలో, ఇండో చీనాలో అమెరికన్ సైనిక సహాయం లేకపోతే అన్య సైన్యాల బలం ఎంత క్షుద్రమైనదో నిరూపించబడుతున్నది. మెకార్థర్ అభిప్రాయాన్ని తెలుసుకోడానికి 7500 మైళ్ళు ప్రయాణం చేసివెళ్ళి ఆసియాలో "కొరియా విధానాన్ని" అమలు జరపడానికి ప్లాన్ వేసుకుంటున్న ట్రూమన్‌కు, కొరియా విజయం పరిపూర్తి కాకముందే, ఆ ప్లాను వెంటనే అమలు జరపడానికి అగత్యం కలుగుతున్నది. అయితే ఇండో చీనాలో అమెరికన్లకు కొరియాలోవలె సమితి సైన్యాల పేరు తగిలించుకోడానికి వీలుండకపోవచ్చును. సమితి నియమాల సవరణ ఇండో చీనాలో "దురాక్రమణ"ను అరికట్టడానికి ఉపయోగపడదు.

ఫ్రెంచి సైన్యాలకు టాంకింగ్ రాష్ట్రంలో పెద్ద పరాజయం కలిగింది. రాష్ట్రప్రధాననగరం హానోయ్‌కి ముప్పు వస్తున్నది. వియత్ మిన్ ఉద్యమకారుల సైన్యాలపైన ఫ్రెంచి విమాన బలాలు బాంబులు వేశాయి. ఈవిమానాలలో అమెరికన్ విమానాలు కూడా ఉన్నాయి. అమెరికన్ వైమానికులే వీనిని నడిపి అమెరికన్ బాంబుల్ని ప్రయోగించారు.

పరిస్థితి విషమిస్తున్న కొద్దీ బావోడయ్ పేరుమీద నడుస్తున్న ప్రభుత్వానికీ ఫ్రెంచి అధికారులకీ మధ్య వైషమ్యాలు అధికమౌతున్నాయి. ప్రస్తుత పరాజయాలకి ఫ్రెంచి అధికారులదురాశా పరత్వం, అహంకారం, అసమర్థత, హేతువులని వియత్‌నమ్ (బావోడాయ్) ప్రభుత్వ ప్రధాని అన్నాడు. వాస్తవానికి నాడు ఇండోచీనాలో ఫ్రెంచి సైన్యాలను నడుపుతున్నది అమెరికన్ నిపుణులు. పరిపాలన సాగిస్తున్నది, ఫ్రెంచివారి తరఫున అమెరికన్ రాయబారి డోనల్డ్ హీత్. దీనివల్లనే కమ్యూనిస్టు వ్యతిరేకులైనవారిలో చాలమంది వియత్ మిన్ ఉద్యమంలోకి క్రమంగా జారిపోతున్నారు.

## ఉత్తర కొరియా

ఉత్తర కొరియా కమ్యూనిస్టు ప్రభుత్వ రాజధాని పయంగ్ యాంగ్ అమెరికన్ సేనలవశమయింది. రాజధానీ నగరం నుంచి కమ్యూనిస్టు మంత్రులూ, సైన్యాలూ పారిపోకుండా నిరోధించడానికి ఒక అమెరికన్ పెరాట్రూప్ దళం 80 రాజధానికి ఉత్తరంగా విమానాలలో దిగింది. కాని అప్పటికే దాటవలసినవారంతా దాటేశారు. కొత్త రాజధాని మంచూరియా సరిహద్దులో సిన్యూజూనగరం చేరింది. దక్షిణకొరియన్ సైన్యాలను త్వరితంగా సరిహద్దు చేరవలసిందని మెకార్థర్ ఆజ్ఞాపించాడు.

ఫూసాన్ రక్షణకాలానికి తరవాత ఇన్నిరోజులికి కొరియా యుద్ధంలో చీనా రష్యాలు జోక్యం కలుగచేసుకోవని మెకార్థర్ నిస్సంకోచంగా చెప్పాడు. కాని ఈ చెప్పడంలో మంచూరియా సరిహద్దు సమస్యా భవితవ్యం ఇమిడి ఉంది. మంచూరియాకూ కొరియాకూ సరిహద్దు యాలూనది. ఈ నదిపై నిర్మించబడిన ప్రాజెక్టులపైన కొరియన్ పరిశ్రమలూ మంచూరియన్ పరిశ్రమలూ, ఆధారపడి వున్నాయి. అమెరికన్ సైన్యాలు మంచూరియా సరిహద్దు చేరకముందే దక్షిణ కొరియన్ సైన్యాలు ఈ ప్రాజెక్టుల సంగతి చూడాలని మెకార్థర్ ఉద్దేశం కావచ్చును. ఇది జరగనివ్వాలని అనుమతికోసమే మెకార్థర్ యుద్ధంలో చీనా కలగచేసుకోబోదని ఇప్పుడు చెప్తున్నాడు. [సూర్యనారాయణ]



# మనదేశం

కాంగ్రెస్ కార్యవర్గ నిర్మాణం గురించి నెహ్రూ. టండన్‌గార్ల మధ్య ఒక విధంగా రాజీ కుదిరింది. కాని రాజాజీ అతికించిన ఈ టంకం ఎంతకాలం నిలుస్తుందో సందేహం. నాసిక్ కాంగ్రెస్ సమావేశ నిర్ణయాల్ని యథాతథంగా అమలు జరపకపోతే టండన్‌గారికే చిక్కులొస్తాయని పండిట్ నెహ్రూ అన్నారు. ఈ నిర్ణయాల్ని అమలు జరపవలసింది కాంగ్రెస్ కమిటీ లేకొవనీ ప్రభుత్వంకూడా బాధ్యత వహించవలసిందేననీ టండన్‌గారన్నారు.

పాకిస్తాన్‌నుంచి వచ్చిన శరణార్థుల పునరావాస సమస్య గురించి టండన్ నెహ్రూగార్లు విరుద్ధాభిప్రాయాలు ప్రకటిస్తూనే ఉన్నారు.

దేశవిభజనకు ఒడబడినది కాంగ్రెస్ నాయకులే కాబట్టి, తత్ఫలితంగా పాకిస్తాన్ విడిచి భారతదేశం వచ్చిన లక్షలాది హిందువుల్ని ఉద్ధరించే బాధ్యత కాంగ్రెస్ ప్రభుత్వంపైనే ఉందని టండన్‌గారి వాదం. పాకిస్తాన్‌లో మహమ్మదీయుల దౌర్జన్యానికిగురై ఆస్తుల్నీ, సకలసంపదల్నీ, సుఖాల్నీ, విడిచివచ్చేసినారనే అభిమానం, సానుభూతీ ఉండడం అందరికీ సహజమే. అయితే పోగొట్టుకోడానికి ఆస్తిలేక, దౌర్జన్యాలకు గురికాకపోయినా నిత్య నిరాదరణకు లోనౌతున్న దేశంలోని లక్షలాది పేదప్రజలపట్ల ఈ కాంగ్రెస్ నాయకవర్గానికి నూరోవంతు సానుభూతి ఉన్నప్పటికీ కమ్యూనిస్టులపైన పటేల్‌గారు కత్తులు నూరనవసరం లేకపోయేది. పుట్టుకతో దరిద్రులైన వారిని సమాజమూ, ప్రభుత్వమూ వాళ్ళకర్మానికి వాళ్లని విడిచిపెట్టేసినట్లే, అర్థాంతరంగా అబ్బిన దారిద్ర్యానికి శరణార్థుల్ని విడిచి పెట్టడంవల్ల అంతకు మించినపాపం ఏదీ చెయ్యడంలేదు. శరణార్థులపట్ల సానుభూతిచూపే ఈ త్యాగధనులకటాక్షానికి పక్షపాత దోషం ఆరోపించకపోయినా, వీరు కోరేది సిద్ధించడం అసంభవమని చెప్పాలి.

దేశమంతటా దారిద్ర్యం నివారణై ప్రజల స్థితి బాగుపడినప్పుడే శరణార్థులస్థితి బాగుపడగలదు. ఒక్కటే తేడా ఉన్నది. శరణార్థుల దుర్గతికి బాధ్యులైనవారు కాంగ్రెస్ నాయకులని కనపడుతున్నది. దేశంలో దారిద్ర్యానికి బాధ్యులైనవారెవరూ అంటే కాంగ్రెస్‌వారని నిరూపించలేకుండా ఉన్నారు. ఈవాదంతో పండిట్ నెహ్రూకు నిమిత్తంలేకపోవచ్చును. కాని శరణార్థులకు పోయిన ఆస్తిసంపదల్ని తెచ్చిపెట్టడానికి భారతీయులపైన పన్నుల భారాన్ని వృద్ధి చెయ్యడం అసంభవమని నెహ్రూ స్పష్టంగా చెప్పారు. కాపిటల్ లెవీ విధించాలని టండన్ పదేపదే ఉపన్యాసాలిస్తు



పురుషోత్తమదాస్ టండన్

న్నారు. ఈ అతకని టంకం ఎన్నాళ్లు నిలుస్తుందో చూడవలసిందే.

కాంగ్రెస్ మంత్రులు దసరాపండగల్లో, ఆంధ్రదేశంలో బస్తీల జనాలకి ఏకాదశీ వ్రతపుణ్యాన్ని మూటగట్టి వద్దుమొర్రో అంటున్నా వారి నెత్తినకొట్టారు.

చెన్నపట్నానికి, తమిళ్నాడు జిల్లాలకీ బసంగి ధాన్యపు బియ్యం సొక్కలేదు. గత సంవత్సరం కరువు భయంతో ప్రభుత్వం సర్కారు జిల్లాల్లో బసంగి పంటని చేతికొచ్చినంతవరకూ కొనేసి దక్షిణాది రైళ్లకెక్కించారు. దొరికినదే సందని చాటుగా దాచగా, పుచ్చిన బియ్యం, ముక్క బియ్యం, ఇసకా, బెడ్డా వగైరాలన్నీ బసంగి బియ్యంతో గుచ్చెత్తి మన మిల్లర్లు వందలూ వేలూ టన్నుల చొప్పున 1949 సెప్టెంబర్ అక్టోబర్‌లలో పంపించారు. అది భరించలేక ప్రభుత్వం చెన్నపట్నంలో హోటళ్లకిచ్చి వచ్చేపోయే జనంచేత తినిపించారు. దీనికిగాను ప్రభుత్వం ఈసంవత్సరం కసి దీర్చుకుంది. అయితే మిల్లర్లమీద కాదు కసిదీర్చుకున్నది; ప్రజలమీద. పుచ్చు బియ్యం, ఎర్రబియ్యం, ఉప్పుడు బియ్యం రుచి ఎలావుంటాయో మన బస్తీవాసులికి చూపించారు.

దాన్యసేకరణలో మిల్లర్లకి పెత్తనమిస్తే, దేశంలో కల ఆహారాన్నంతనీ ప్రభుత్వానికిచ్చిదొంగచాటుగా బోట్లు ఎక్కించిని తుడిచేశారు. ఈనాటికి మళ్లీ ఏలూరు విజయవాడ మొదలైన బస్తీలు పండగనాడు రంగంనించి రాగల బియ్యంకోసం ఎదురుచూస్తూ కూచుని, చివరికి ఏకాదశీ వ్రతపుణ్యం దక్కించుకున్నాయి. మనచేత్తో మన పొట్ట గొట్టించడం నేర్చిన అరవ మంత్రుల్నీ, వారి చేతుల్లో కొంకి కర్రలై కూచున్న తెలుగు మంత్రుల్నీ ఆంధ్రదేశం ఎన్నటికీ మరవదు.

కులద్వేషం ఆయువుపట్టుగా తమిళ్నాడు అంతటా పాకుతున్న ద్రావిడస్తాన్ పార్టీ (ద్రావిడ కళ్ జగమ్) హిందీ వ్యతిరేకాందోళన తరవాత మరొకడుగు ముందుకు వేసింది. ఉత్తరాదివాళ్లు చెన్నపట్నాన్నీ ద్రావిడస్తానాన్నీ దోచుకుపోతున్నారని ఆందోళన ప్రారంభించారు. చెన్నపట్నంలో ఉత్తరాదివాళ్ల హోటళ్ళముందూ, బట్టల షాపులముందూ పికెటింగ్ ఆరంభించారు. పికెటింగ్ చెయ్యవచ్చుగాని, దౌర్జన్యం కూడదని ద్రావిడస్తాన్ ఉద్యమానికి జిన్నా అయిన రామస్వామి నాయకర్‌గారన్నారు. అసలు ఉత్తరాది

(39-వ పేజీ చూడండి)

## 4




హాల్లో పంచాయతీ జరుగుతోంది. గది గుమ్మంవద్ద ఇద్దరు పోలీసులూ సబిన్స్పెక్టరూ కాపలా ఉన్నారు. ఒక పోలీసు వాఙ్మూలాలు వ్రాసుకుంటున్నాడు. దుర్గయ్య ఎక్కడికి వెళ్లినదీ ఎవరూ చెప్పలేకపోయారు. తలగడ కింద కత్తి ఉందని కమలగాని మాధవరావు కాని బయట పెట్టలేదు.

నరసయ్య అందరివంకా చూసి అడిగాడు "దుర్గయ్యగారెక్కడికి వెళ్లినదీ ఎవరికీ తెలియదా ?"

కమల ఆత్రంతో మాధవరావు వంక చూసింది. మాధవరావు నిశ్చలంగా ఉన్నాడు. రామనాథం అన్నాడు. "ఎక్కడికి వెళ్ళారో తెలియదు. కానిమాధవరావుగారికి తెలిసివుండాలని నా నమ్మకం. ఉదయం ఆయనే నేను పడుకున్న గది తలుపుతట్టి నన్ను లేపారు. నేను తలుపు తియ్యగానే గదిలోకి తొంగిచూడ్డం ఆరంభించారు. ఎందుకని నేనడిగితే సమాధానమివ్వలేదు. ఆయన్ని చూస్తేనే ఏదో జరిగిందని అనుమానం కలిగింది నాకు. హత్య జరిగిన విషయం ఆయనకి అందరికంటే ముందు తెలుసునని నా ఉద్దేశం. మాపార్వతమ్మకి ముప్పువచ్చిందని ఆయనభయపడ్తున్నారు. నేను కోపగించి ప్రశ్నిస్తున్నా లక్ష్యపెట్టకుండా గదిలోకి చూశాడు. పార్వతమ్మ పక్కకి ఒత్తిగిలి నిలబడగానే కంగారు పడుతూ హాల్లోకి వెళ్ళారు. అక్కడ ఏం జరుగుతుందో అని నేను కనిపెడుతూనే ఉన్నాను. ఆయన గది తలుపు నెట్టాడు. లోపల గున్నేశ్వర్రావు దుప్పటిపైన నెత్తురు కనపడింది. దగ్గిర కెళ్లి చూశారు. హత్య జరిగినట్లు శవాన్ని చూడకముందే, ఆయనకూ కమలకు తెలుసును. దుర్గయ్యగారెక్కడికి వెళ్ళినదీ కూడా ఆయనకి తెలుసునని నా నమ్మకం. అసలు ఆయనే ఎక్కడికైనా పంపి ఉండవచ్చు కూడా."

"రాత్రి ఈ మేడమీదనే మీరందరూ పడుకున్నారు గదా. చప్పుడు గాని, కేకలు గాని ఎవరికీ ఏమీవిన పడలేదా ?" అని అడిగాడు నరసయ్య.

సత్యనారాయణ అన్నాడు, "నేనొక ముఖ్యవిషయం చెప్పాలండి. రాత్రి నేను ఇక్కడ వరండాలో మడత మంచంమీద పడుకున్నాను. తూర్పు వేపు గదికి సమీపంలో ఈ హాలు కిటికీవద్ద మంచం వేశారు. ఒక రాత్రి వేళ చప్పుడయి నాకు మెళుకువొచ్చింది. అప్పటికి వెన్నెల వరండాలో పడుతోంది. హాల్లో కొద్ది వెలుగుంది. కిటికీలోనుంచి చూసేసరికి అక్కడెవరో తచ్చాడుతున్నారు. మెల్లిగా తలగడకింద కళ్లజోడు తీసి పెట్టుకుని చూశాను. ఆవ్యక్తిహాల్లో చేతులు చాచి తడుములాడుతున్నాడు. ఎవరో నిద్రలో నడుస్తున్నారు."

"నిద్రలో నడుస్తున్నాడని ఎలా అనుకున్నాడు?"

"ఆనడకతీరు, తడుము లాడ్డంచూసి అనుకున్నాను. హాల్లో కొంత వెలుగుంది. కుర్చీలూ మేజాలు కనపడుతూనే ఉన్నాయి. తడుము లాడవలసిన అవసరం లేదు. అయినా అలమారుదగ్గరున్న కుర్చీ అడ్డంగా ఉన్నదాన్ని పక్కకి గెంటకుండా చేతులుచాచి అలమారు తలుపులు తెరిచాడు. తెరవడంలో ఒకతలుపు గోడకి కొట్టుకుని చప్పుడయింది, దాన్ని బట్టి ఆమనిషికి నిద్రలో నడిచే అలవాటుందనుకున్నాను. పైగా తలవెనక్కు వాలవేసి ఉంది."

"ఆడదో మొగాడో చెప్పగలరా?"

"వెలుగున్నా అంత స్పష్టంగా."......

"సరే ఆమాట అలావుంచండి. ఆమనిషి అలమారు దగ్గరేంచేశాడు?"

"తలుపులు తెరిచాడు, ఏదోవెతికాడు. తరవాత తలుపులు వేసితాళం వేశాడు. మెల్లిగా నడిచి హాల్లో ఈవెనక ద్వారంగుండా వెళ్లిపోయాడు. మళ్లీకనిపించలేదు."

"ఈవెనక గదిలోఏముంది?"

"అది చిన్నహాలు. దానివెనక నాగది వుంది?" అంది కమలఅనుమానిస్తూ. సత్యనారాయణవంక అనుమానంతో చూసింది. అతనిదృష్టి నరసయ్యపైనా, పక్కన వ్రాసుకుంటున్న పోలీసుపైనావుంది.

"అప్పటికి టైమెంత అయిందో చెప్పగలరా !"

"ఆ మనిషి కనపడగానే కంగారుపడ్డాను. మెల్లిగాతలగడ కిందదాచుకున్న కళ్ళజోడుతీసి పెట్టుకోగానే, ఇదిగో ఈ గోడకున్న గడియారం కనపడింది. సరిగ్గా పన్నెండుం బావయింది. ఆ తరవాత చాలాసేపటివరకూ నిద్రపట్టలేదు. ఒక గంటకి నిద్రపట్టినా అదికలత నిద్రే."

నరసయ్య కమలవంక తిరిగి ప్రశ్నించాడు. "రాత్రి మీగదిలోకి ఎవరైనా ప్రవేశించారా?"

"లేదు."

"మీ తలుపు చప్పుడుకూడా కాలేదా? అసలు ఏచప్పుడూ వినపడలేదా?"

"లేదు. నాగది లోగడియ వేసివుంది."

"రాత్రిమీకు ఒక్కసారీ మెళుకువ రాలేదా?"

"లేదు."

"దుర్గయ్యగారిప్పుడెక్కడి కెళ్లారు?" కమల మాధవరావు వంకచూసింది.

మాధవరావు గోడగడియారం వంకచూస్తున్నాడు. సంకోచిస్తూ చెప్పింది "నాకు తెలియదు."

"మీరునిజం చెప్పండి. మీ మంచి కోసమే చెప్తున్నాను. ఎల్లాగూ ఆయన దొరక్కపోడు. కాని ఇంతలోకే తప్పించుకోడంఎందుకు?"

"తప్పించుకోడం లేదు."

"అది మీ కెలా తెలుసు?"

"మా మామయ్యసంగతి నాకు తెలుసును."

"హత్యజరిగినట్లు మీకు ఇవాళపొద్దున ఎలా తెలిసింది?"

కమల సమాధానంచెప్పలేదు. మాధవరావు వంకచూసింది. మాధరావు "అది నే తరువాత చెప్తాలెండి" అన్నాడు.

"సరే పోనీ మీరుచెప్పగలరా దుర్గయ్యగారెక్కడి కెళ్లారో?"

మాధవరావు అక్కడున్న నలుగురి ముఖాలూ పరికించాడు. "అదికూడా ఇప్పుడేం చెప్పలేను."

"చెప్పలేనంటేకాదు, చెప్పాలి. మీరు ప్లీడరువృత్తిలో ఉన్నారు. చెప్పకపోతే ఎటువంటి చిక్కులు వస్తాయో మీకు తెలియకపోదు."

"అదంతా నాకు తెలుసు. ఆయన ఒక పనిమీద పొద్దున్నే బయలుదేరి వెళ్లాడు. నేను ఆయనతరఫున వ్యాపారంపరిష్కరించి పెట్టడానికివొచ్చాను, ఆవ్యాపారం సంగతులేవీ నేను మీకు చెప్పనవసరము లేదు. అదంతా నేనుచెప్పకూడదు. ఆయనే చెప్పాలి."

"ఆవ్యాపారమంతా నాకక్కర్లేదు. ఆయనెక్కడి కెళ్లాడో చెప్పండి."

"ఆయన ఎక్కడికి వెళ్లడానికి బయలుదేరాడో నాకుతెలుసును. అంతే. అదికావలసివస్తేతరువాత నాస్టేట్‌మెంట్‌లో తెలియచేస్తాను కాని వ్యాపారపరిష్కారందృష్ట్యా ఇప్పుడు చెప్పలేను. ఇంకఆపైన ఎక్కడికి వెళ్లాడో అడిగితే నాకెలా తెలుస్తుంది? ఆయన వ్యాపారం నిమిత్తం బయలుదేరాడు. దానికీ, ఈ హత్యకీ సంబంధం లేదు."

"ఆయన తిరిగివస్తాడో లేదోచెప్పగలరా?"

"వస్తాడనే నా అభిప్రాయం. కాని ఆయనేం చెయ్యగలడో నాకునిశ్చితంగా తెలియదు."

"ఇదిచాలా ప్రమాదమైన విషయం ప్లీడరుగారూ."

"ఈవిషయంలో నేనూనిస్సహాయుణ్నే."

"చివరికి ఆయనకి జామీనుకూడా నిరాకరించ బడుతుంది."

"ఆవిషయం ఆయనకే తెలియాలి. నేను పారిపొమ్మని చెప్పలేదు. మీకుఅనుమానం ఏమైనా ఉందా?"

"నాకు అనుమానం లేదనుకోండి. కాని రూల్సు."

"మీరు రూల్సుప్రకారం నడవచ్చు. ఎవరు తప్పుచేస్తే వారు శిక్షకు అర్హులే."

ఇంతలో రామనాథం ముందుగదిలో చెల్లెలితో మాట్లాడి వచ్చాడు. "నేనొకటి చెప్పగలనండి. దుర్గయ్యగారు అంకరాజు ఇంటికి వెళ్ళి వుంటారండి. వారితో వ్యాపారం పరిష్కారం నిమిత్తమే ఈ ప్లీడరుగారు వచ్చారండి."

"అంతే నా ప్లీడరుగారూ?"

"నే నింకేమీ చెప్పడం భావ్యంకాదు."

"మీతో ప్రత్యేకంగా మాట్లాడాలి. అభ్యంతరం ఏమైనా వుందా?"

"లేదు. నడవండి నాకు ప్రత్యేకంగా ఒక గది ఏర్పాటయింది. అక్కడికి వెడదాం రండి."

ఇద్దరూ మాధవరావు గదిలోకి వెళ్ళారు. నరసయ్య ఒక కుర్చీలో కూర్చున్నాడు, మాధవరావు మంచం పట్టెమీద కూచున్నాడు. "అంకరాజు దుర్గయ్యగారి వాటాదారు. ఆయనతో తగవొచ్చింది. దుర్గయ్యగారికి భార్యతోకూడా తగవుంది. అవి పరిష్కరించడానికనే నేవచ్చాను. ఉదయమే దుర్గయ్యగారక్కడికెళ్ళారు. నేను హాల్లో కూచున్నప్పుడు ఆయన మేనగోడలు అలమార తెరిచి అందులో చురకత్తి కనిపించడంలేదని చెప్పింది. దుర్గయ్యగారికి నిద్రలోలేచి నడిచేఅలవాటుంది. అలా లేచినప్పుడు, ఆఅలమారుతెరచి కత్తి తీసుకునే అలవాటుకూడా ఉంది. తన్ని చంపడానికే అలాచేస్తున్నాడని ఆయన భార్య పార్వతమ్మగారు పుట్టింటికి వెళ్ళిపోయింది. ఏదో విధంగా రాజీచేసుకోవాలని ఇక్కడికొచ్చింది."

"ఆ కత్తి ఏమయింది?"

"నేనూకమలా కలిసి దుర్గయ్యగారి పడకగదికి వెళ్లాం. అక్కడ పడకమీద తలగడ కింద కత్తికనపడింది. ఇప్పుడూ అది అక్కడేవుంది. దాన్ని నేనుకాని కమల కాని చేత్తోముట్టుకోలేదు. కత్తిమొన నెత్తురుతోవుంది. అందువల్ల ఏదోజరిగిందని ఇద్దరం ఊహించుకున్నాం. ముందు ఆయన భార్యపడుకున్న గది చూశాం. తరవాత ఈ గదిచూశాం. అంతే. మీకుకబురొచ్చింది. ఇదిజరిగినట్టు దుర్గయ్యగారికి తెలియదని నానమ్మకం. ఉదయంవెళ్లేముందు ఆయన్ని చూశాను. ఆయనపారిపోలేదని నానమ్మకం. త్వరలోనే తిరిగివస్తాడనుకుంటాను."

"సరేలెండి అదంతా రికార్డులోరాస్తాం. ఇప్పుడేంచెయ్యాలో చూడాలి. రండి హాల్లోకి వెడదాం"

ఇద్దరూ లేచారు. నరసయ్య తిన్నగా దుర్గయ్య పడకగదిలోకి వెళ్లాడు. తలగడ కింద కత్తి అలాగేవుంది.

* * * *

కొంతసేపటికి అందరూ వెళ్లి పోయారు. శవం ఆస్పత్రికి చేర్చబడింది. పౌన్ మేజస్ట్రేటుకూడా వచ్చిగదినీ, హాలూ వరండా అలమారూ పరీక్షచేశాడు. కత్తి, తలగడ గలీబూ, పరుపుగలేబూ పోలీసులు తీసుకు వెళ్లారు. గదికిసీల్ వేశారు.

అందరూ వెళ్లిపోయారు. గేటు దగ్గ మాత్రం ఇద్దరుపోలీసులున్నారు. ఇల్లంతా బావురుమంటున్నది. కమల మాధవరావు మాత్రం మిగిలారు.

"నయమే మీ మామయ్య ఇంతవరకూ రాలేదు."

"అవును. రాడు. నేనేకబురంపాను.

"ఎల్లాపంపావు? పొద్దున్నుంచీ అందరం హాల్లోనే ఉన్నాంగా."

"ఉన్నాం. మీరు ఈ గదిలోకి వెళ్లగానే వంటవాణ్ని పంపాను. దారిలో రామచంద్రరావు ఎదురైనాట్ట. అతనితో సంగతంతా చెప్పాట్ట. అతనే తిరిగి వెనక్కి వెళ్ళాడు. వంటవాడొచ్చేశాడు."

"ఏమని కబురు పంపావు?"

"జరిగిన సంగతి చెప్పమన్నాను. వెంటనే ఎక్కడికైనా వెళ్లిపొమ్మనీ, కబురు అందే వీలుకూడా ఉంచమనీ చెప్పమన్నాను."

"కాని అది మంచిపని కాదు."

"ఏమి?"

"ఆయన పారిపోకూడదు."

"మరెల్లా? ఎరెస్ట్ చేస్తే?"

"చెయ్యనీ. ఇక్కడ గడబిడ అంతా పూర్తి అయేవరకూ రాకూడదన్నాను కాని ఆయన పారిపోవాలని నాఉద్దేశం కాదు."

"బాగుంది. ఎరెస్టుచేస్తే ఏంకాను?"

"ఏమౌతుంది? ఎరెస్ట్‌చేస్తే జామీను మీద విడుదల కావచ్చుగా. ఇప్పుడుపారిపోతే జామీను ఇవ్వరు."

ఇద్దరూ దీర్ఘంగా ఆలోచిస్తూకూచున్నారు. తరువాత కమలఅంది "ఇప్పుడేమిటి చెయ్యడం?"

"ఎలాగైనా దుర్గయ్యగార్ని కలుసుకుని మాట్లాడాలి. ఈ సంగతెవరికీ తెలియకూడదు. తెలిస్తేనాకూ, నీకూ, అందరికీ కూడా ముప్పే."

కమల ఆలోచించిది. కొంతసేపుఇద్దరూ మౌనంగా ఉన్నారు. దూరాన బస్తీగోల తప్ప చుట్టూ అంతా నిశ్శబ్దంగా ఉన్నఅదనులో కమలకి తానే పరిస్థితిలో ఉన్నదో

స్మృతికొచ్చింది. ఎక్కడా ఆధారంలేదు కన్న కూతురు వలె పెంచినమామ అపాయంలో చిక్కుకున్నాడు. వృత్తిరీత్యా సహాయంచెయ్యడానికి వచ్చిన మాధవరావు ఆత్మీయుడుకాడు. ధనిమిచ్చినా సహాయపడతాడో లేదో సందేహమే. పరాయివాడైనా రామచంద్రరావు తన అండను నిల్చిఉన్నాడు. తనపైన పెద్ద ఆశలు పెట్టుకున్నాడు. తనకుకూడా ఈనాడు అతడొక్కడే ఆధారమైనాడు. అతనితో ఏకాంతంగా మాట్లాడాలనీ, తనబాధలన్నీ చెప్పుకోవాలనీ ఆమె ఆరాటపడుతోంది. కానీ వీధిలోకి వెళ్ళడానికి జంకుతోంది. ఇంట్లో నౌకర్లూ, డ్రైవరూ ఉన్నారు. కాని ఎక్కడున్నారో ఒక్కళ్లూ కనిపించలేదు.

"ఇప్పుడేవస్తాను" అని మాధవరావుతో చెప్పి కమల లోపలికివెళ్లింది. మెల్లిగా నడిచివెడుతున్న కమలని పరిశీలనగా, చూశాడు మాధవరావు. విషయం విచిత్రంగా కనిపిస్తోంది. ఇంక ఏమాత్రంజాప్యం చెయ్యకుండా దుర్గయ్యగార్ని చూడాలి అని నిశ్చయించుకున్నాడు.

కమలవచ్చింది. "ఒక్కసారి రామచంద్రరావుతో మాట్లాడివస్తాను. మీరు ఇక్కడే ఉంటారా?" అంది.

"లేదు నేను ఒక్కసారి డాక్టరుగారితో మాట్లాడాలి. ఇద్దరం కారులో వెడదాం. నన్ను డాక్టరుగారింటివద్ద దిగబెట్టి మీరు వెళ్లండి" అన్నాడు మాధవరావు.

కమల ఆశ్చర్యపడింది. మొదట మీరన్నా క్రమంగా మాధవరావు నువ్వు అంటున్నాడు. ఇప్పుడుమళ్లీ మీరు అంటున్నాడు. కొంతకాకపోతే కొంతైనా సహాయపడతాడనుకుంటున్న మాధవరావు తనమామని అనుమానిస్తున్నాడు. అందువల్లనే తనపట్లకూడా అతని అభిప్రాయం మారిందని అనుమానించింది. "పోనివ్వండి. నేనిక్కడుంటాను. మీరు డాక్టరుగారి ఇంటికి వెళ్ళండి. ఇకనించి మీ అనుమతిలేకుండా నేనేం చెయ్యను. ఎరెస్ట్ చేస్తారని భయపడి మామయ్యకి అలా కబురు పంపాను."

మాధవరావన్నాడు. "ఫరవాలేదు లే, ఇద్దరంకలిసే వెడదాంరా."

ఇద్దరూ కార్లో బయలుదేరారు. కాని కారుస్టార్ట్ కాకముందే గేటువద్ద ఉన్న పోలీసుల్లో ఒకడువచ్చాడు.

"మీరు ఎక్కడికివెళ్లినా అడిగి తెలుసుకోవాలని ఇన్స్పెక్టర్ గారి ఆజ్ఞండి" అన్నాడు.

మాధవరావు కమల ముఖంవంక చూశాడు కమల బెదురు చూపులు చూసింది.

"డాక్టర్ మూర్తిగారి హాస్పిటల్ కి. మళ్లీ గంటలో వచ్చేస్తాం" అన్నాడు మాధవరావు. పోలీసు నోట్ బుక్ లో రాసుకున్నాడు. కారు వెళ్లిపోయింది. మాధవరావు డాక్టర్ మూర్తిగారి డిస్పెన్సరీ వద్ద దిగాడు. "రామచంద్రరావుని చూసిత్వరలో వచ్చెయ్యి. ఆలస్యం చెయ్యవద్దు. తిన్నగా ఇంటికే వచ్చెయ్యి. నేను ఇక్కడ ఆట్టేసేపుండను." అన్నాడు కమలతో, కమల తలూపింది.

మాధవరావు డిస్పెన్సరీలోకి వెళ్లాడు. అయిదు నిమిషాల్లో మళ్లీఇవతలకు వచ్చాడు. కూడాడాక్టరున్నాడు. డాక్టర్ కారొచ్చింది. డాక్టర్ డ్రైవర్ని పిల్చి మెల్లిగా ఏదో చెప్పాడు. మాధవరావు కార్లోకూర్చున్నాడు డాక్టర్ డిస్పెన్సరీలోకి వెళ్లాడు. కారు బయలుదేరి తిన్నగా పాతవూరు వెళ్లింది. అక్కడొక మలుపు తిరిగి ఒక పెద్దవీధిచేరిన తరవాత కారు మెల్లిగా సాగనారంభించింది. డ్రైవరూ, మాధవరావు జాగ్రత్తగా రెండు వైపులా సందుల్లో చూడనారంభించారు.

అలా కొంతదూరం వెళ్లేసరికి ఒక సందులో కమల కారు ఆగివున్నది కనిపించింది. మాధవరావు కారుదిగి సందులోకి నడిచి వెల్లాడు. కారాగిన చోటుచేరి, ఆ పక్క ఇంటిలో చూశాడు. చూస్తున్నంతలో నేఎదురింటిలోనుంచి ఒకయువకుడొచ్చాడు. పొడుగ్గా బలిష్ఠంగా ఉన్నాడు. పాతికేళ్లుంటాయి.

"మీరు కమలకోసం చూస్తున్నారా?" అని అడిగాడు మాధవరావుని.

"మీరెవరు?"

"నా పేరు రామచంద్రరావు. ప్లీడరు మాధవరావుగారు తమరేకదూ?"

"అవును. కమలెక్కడుంది?"

"ఇప్పుడేవస్తుంది! మీరీయింట్లోఉండండి. మీరు వస్తారని కమల చెప్పింది. నన్ను చూడమని కూడా చెప్పింది."

"నేవస్తానని చెప్పిందా?" అన్నాడు మాధవరావు నిశ్చేష్టుడై. క్షణంసేపు ఆలోచించాడు. "సరేపదండి" అన్నాడు.

(39-వ పేజీ చూడండి)

కథానిక:




'నువ్వేం చేసేవో నీకు తెలుసా?'

'నా పరిస్థితిలో వున్న వాళ్ళంతా చేసేదే. ఇందులో వింతేముంది?'... "ఎంత భావగర్భితమైన వాక్యాలు" అన్నాడు గోపాలం. గోడమీద అంతకుముందెవరో రాసిన రాతలు చూపిస్తూ. శారద కేమీ అర్థంకాక చూస్తోంది. అతనికి తోచిన వేయి అర్థాలలోనూ ఒక్కటీ ఆమెకు తోచలేదని ఆమె ముఖమే తెలుపుతూంది. హోటల్లో, గదిలో, మంచంప్రక్క గోడ మీధ ఏ సోమరిపోతులో వినోదార్థం రాసుకుని వుంటారు!! ఇంతలో హోటలు కుర్రాడు ట్రేలో కాఫీ తెచ్చి, టేబిలు మీద పెట్టి వెళ్ళిపోయేడు. ఇద్దరూ కాఫీ త్రాగడానికి కూర్చున్నారు. గోపాలం ఒక కప్పులోపోసి శారదముందు పెట్టేడు. తాను త్రాగబోయి, నాలుక కాలి, ప్రక్కన పెట్టేడు. ఆ వెచ్చని కాఫీనుండి లేచే ఆవిరి అతని మనోభావాలతో కలిసి పైకి ప్రాకిపోతూంది. ఏయే సంఘటనలు ఎలాగ ఉచ్చుదశకు దారితీసి తన్నింతవరకూ తీసుకు వచ్చేయో గోపాలం ఆలోచిస్తున్నాడు.

* * * *

నాలుగేళ్ళక్రితం గోపాలం, శారద బి. ఏ సీనియరులో వుండేవాళ్ళు. ఏ

## శ్రీ జయంతి శ్రీరామమూర్తి

ముహూర్తాన పరస్పరం తెలుసుకున్నారో గాని స్నేహం జన్మాంతర భాంధవ్యంలాగ యేర్పడింది. ఏదినమైనా శారద క్లాసుకి ఆలస్యంగా వస్తే, గోపాలానికి పాఠమే తెలిసేది కాదు. శరీరం బెంచీమీదవున్నా అతని మనస్సు గాలిలో విహరించేది. సాయంత్రం శారదను కలుసుకోకుండా ఇంటికి పోయేవాడుకాడు. శని ఆదివారాలతనికి గడపడం దుర్భర మనిపించేది. సోమవారం ఉదయం అతనికో ఉగాది. ఇక శారదా యేమాత్రం తీసిపోలేదు. క్లాసులో ఎవరితోనూ మాట్లాడని శారద గోపాలంతో చనువుగా మాట్లాడేది. అతని నోట్సు పుస్తకాలు తరచు తీసుకువెడుతుండేది. అతనికి తన పుస్తకా లిస్తుండేది. కాలేజీ విడిచి పెట్టేక చాలాసేపు లోకాభిరామాయణం విప్పుతూండే దతనితో. అతడు టెన్నిస్ పందేలు గెలిచినప్పుడల్లా అభినందిస్తుండేది. తోటివిద్యార్థిను లతన్ని గురించి ఏమి చెడ్డగా మాట్లాడినా, ఆమె అతని పక్షాన్నే వాదించేది. ఆ విషయా లతనికీ తెలుసు. గేమ్సు రిప్రజంటేటివ్ ని ఎన్నుకోవాలి. శారద గోపాలం తరఫున కేన్వాస్ చేసేది వోట్లకి. ఆంధ్రాభ్యుదయవారం వచ్చింది. ఆహ్వాన సంఘానికి గోపాలం ప్రెసిడెంటు. శారద సెక్రటరీ.

ఒకనాడు బి. ఏ విద్యార్థులు ప్రొఫెసర్లకు 'టీ పార్టీ' చేసేరు. ఆ రోజుతో కాలేజీ క్లాసులు ఆఖరు ఆ సంవత్సరానికి విద్యార్థులు చాలామంది మాట్లాడే రాసందర్భంలో, ఒకరినుండి ఒకరు పొందబోయే ఎడబాటుకి తమ సంతాపాన్ని వెలిబుచ్చుకున్నారు. గోపాలంకూడా మాట్లాడేడు. అతన్ని గాఢమైన విచార మావేసించింది. అతను తలపోసే ఎడబాటు శారదతో– ఎడబాటేనని అతని కళ్ళే చెబుతున్నాయి. ఆ విషయం శారదా గ్రహించింది. గోపాలం మనస్సు ఎంత సున్నితమైనదో ఆమెకు తెలిసింది. టీ పార్టీ ముగిసింది. ప్రొఫెసర్లు కార్లమీద, జట్కాల మీద తరలిపోతున్నారు తమ సంసార మహాసామ్రాజ్యాలకి. విద్యార్థులు సైకిళ్ళ మీదా, కాళ్ళమీదా తమతమ నెలవులు చేరుకుంటున్నారు. శారదా, గోపాలం అక్కడే వుండిపోయేరు కొయ్య బొమ్మల్లాగ. సూర్యు డస్తమిస్తున్నాడు. గోధూళి లేస్తూంది. నీరెండ కాంతిలో తళతళ లాడుతూన్న స్వర్ణ విగ్రహం లాగుంది శారద. గోపాలం, శారదా కాలేజిహోస్టలు దాకా నడిచా రెల్లాగో కష్టం మీద. నిర్జీవ ప్రతిమలలా గోడకానుకు నిలపడ్డాడు. చూస్తారు, కాని మాట్లాడరు. ఆ ప్రక్కన పోతూన్న కుర్రాడొకడు వెనక్కి తిరిగి చూస్తూ నడుస్తున్నాడు. చీకటి పడినసంగతి ఎలక్ట్రిక్ లైట్లు తెలుపుతున్నాయి. హోస్టలు మేట్రన్ బయటకువచ్చి "ఆయనెవరు?" అంది. శారద తడుముకోకుండా "మా అన్నయ్య" అంది. మేట్రన్ వెనక్కి వెళ్ళిపోయింది. గోపాలం, "శారదా! ఈ దిన

(18-వ పేజీ చూడండి)




[illegible] దాటింది. కాని తెల్లవార డాని కింకనూ చాలా టైముంది. అప్పటికప్పుడే బొబోయ్ మమోవ్ పడక మంచం పైనుండి లేచి ప్రయాణానికి సన్నద్ధమౌతున్నాడు. అసలు యదార్థం చెప్పాలంటే అతను ఆ రాత్రల్లా నిదురపోలేదనే చెప్పాలి.

త్వరగా తెల్లారాలి. అందరికంటే ముందు తనే పోలింగ్ స్టేషను వద్దకు వెళ్లాలి. తన ఓటునే ముందుగా పోలుజేయాలి. సోవియట్ ప్రభుత్వంలో ప్రజలు తమకున్న ఓట్లను పోలుచేసే విషయంలోగూడా బోల్షివిల్ దీక్షనే కనపరచాలి.

ఇదే బొబోయ్ - మమోవ్ ఆశయం. ఇలాంటి దీక్ష - పట్టుదలవుండటం వలనే అతను ఆ రాత్రిఅంతా కలత నిద్రతోనే గడిపేశాడు. తెల్లవారకముందే ప్రయాణమై గడపదాటి వీధిలో అడుగెట్టి పోలింగ్ స్టేషన్ వైపుకు చకచకా నడువసాగాడు. తెల్లవారకపోయినా చాలా కిటికీలలో అప్పటికప్పుడే దీపాల వెల్తురు కనుపించుతోంది. దూరంనుండి సంతోషంతో కిలకిలలాడే యువతీమణుల నవ్వులు గాలిమీద తేలివస్తూన్నాయి.

ఇదంతా జూస్తే అతని కా సమయం చీకటి సమయంలా కనుపించలేదు. అసలా రోజున రాత్రి చీకటి అనేది వున్నదా అనే సందేహం చాలామందికుంది. ప్రజలంతా జాగృతులైవుంటే అంధకారం ఎక్కడ ?

వసంతకాలపు మందమారుతాలు చక్కలిగిలి పెడుతూన్నాయి. పంజ్ నది మీదనుంచి కమ్మని సువాసనలను మోసుకవచ్చే ఆ చల్లనిగాలి అతని పెండిజుట్టును రేపపరుగు దీసింది. ఆల్మండ్ - ఆప్రికాట్ చెట్లు వికసించిన పూలగుత్తులతో తెల్లగా మిలమిలా మెరుస్తున్నాయి. తీర్చికట్టిన గ్రంధాలయం - విశాలంగానూ, ఎత్తుగానూ వున్న పాఠశాల - క్లబ్బు - క్రెచీలు వీటన్నిటినీదాటి వీధులవంట నడచిపోతూన్నాడు. బొబోయ్‌మమోవ్.

ఆ సమయంలో అతనికి పూర్వజీవిత ఘట్టాలు కొన్ని స్మృతికొచ్చేయి. మట్టిగోడలతో నిర్మించుకున్న పూరిళ్లు- సన్నగా దుమ్ముకొట్టుకొని వుండే వీధులు - ఆ వీధుల్లో అక్కడక్కడ మురికిగుంటలు-ఒకరొకరికి సతీ సంబంధాలు లేని దరిద్రజీవితం- సంతోషం, సుఖం, ఆనందమంటే ఏమిటో చిన్నతనంనుండి వృద్ధాప్యంవరకు ఎరుగనట్టి భయంకరమైన బ్రతుకు - తన చిన్నతనంలో అలాంటి ముసలివారిని యేడ్పించడానికి చేసిన చిలిపిచేష్టలు - అన్నీ ఒక్కసారిగా అతని మనోనేత్రంముందు తళుక్కుమని మెరిశాయి.

సస్యశ్యామలములైన ఈ విశాలభూములు ప్రజల సొత్తవుతాయని తానెప్పుడైనా భావించాడా? ప్రభుత్వాన్ని ప్రజలే ఎన్నుకుంటారనీ, తమ బిడ్డలే ప్రభుత్వ యంత్రాన్ని నడిపే పరిపాలకులవుతారనీ, అతనెప్పుడైనా ఊహించాడా? తన గ్రామంలో పెద్ద పాఠశాల—గ్రంథాలయము—రేడియో— క్లబ్బు ఇలాంటివన్నీ స్థాపించబడుతాయని అతను కలలోనైనాఅనుకున్నాడా? వృద్ధాప్యంలో తన కింతటి సుఖజీవితం లభించుతుందని యోచించాడా?

ఇవే అతని ఆలోచనలు. ఎడతెగని ఆలోచనలు పొంగి పొరలివస్తూన్న ఉత్సాహ తరంగాలు – గత జీవిత స్మృతులలో మునిగి కాలాన్నే మరచిపోయిన బొబోయ్ త్వరగానే గమ్యస్థానం చేరుకున్నాడు.

అంతకు ముందే పోలింగ్ స్టేషను వద్ద చేరియున్న యువక బృందం వారు సంతోషంతో కేరింతలు కొట్టుతున్నారు. సామొవార్లు (రష్యాలో టీ కాచుకునేందుకు ప్రతి ఇంట్లోనూ ఇవి వుంటాయి.) మరుగుతున్నాయి. వాలంటీర్లు ఉరుకులు- పరుగులతో వేడి వేడి టీని అక్కడకు చేరిన వారందరకూ సప్లయి చేస్తున్నారు.

తలలు నెరిసిన అగ్జాట్కుల్ ముమాట్కులోవ్, కిరమ్లట్ కుషినోవ్ లిద్దరూ కూర్చున్న చోటునుండి లేచి బోబోయ్‌ని ఆహ్వానించి ఆప్యాయంగా పలుకరించారు. పెద్దలు ముగ్గురూ పిచ్చా పాటీ మాట్లాడుకుంటూ కొంత కాలం గడిపేశారు.

ఉదయం 6 గంటలయ్యే సరికి పోలింగ్ స్టేషను తలుపులు బార్లాగా తెరుచుకున్నాయి. ముసలాళ్లు ముగ్గురూ మొదటి పంక్తిలోనే నిలబడ్డారు. ఓట్ల కాగితాలు పెట్టెలో పడేసి త్వరగా బయట కొచ్చె

శారు. కోరస్‌లోలాగ ఐక్యకంఠంతో "బోల్షివిల్ దీక్షతో ప్రతిపనిలోనూ ఎప్పుడూ ముందర వుండడానికే ప్రయత్నిస్తా" మంటూ వారు గొంతుకలు సవరించుకున్నారు. ఎంతో గర్వము - మరెంతో హుందాతనము వారిముఖాల్లో ప్రత్యక్షమైంది.

వృద్ధులు ముగ్గురూ వీధిలోకి అడుగెట్టి తలలు పైకెత్తి బజారువైపుకు చూశారు. తమ ఓట్లను పోలు జేసేందుకుగాను ప్రక్క గ్రామాలనుండి ప్రజలు తండోపతండాలుగా వస్తూన్నారు. ప్రజలకు ఉల్లాసం గల్గించేం చేందుకుగాను గాయక బృందం వారు హుషారుగా పాటలు పాడుతున్నారు. జనసమూహ మధికమైన కొద్దీ ఇనుమడించినే ఉత్సాహంతో వాలంటీరు దళాలు టీకప్పుల నందించు తున్నాయి. మొట్టమొదటసారిగా తమ ఓటింగ్ హక్కును ఆరోజునే అమలు పరచిన యువతీ - యువకుల ముఖాలు చిరునవ్వులతో వికసించాయి. బొబోయ్ ఒక్క నిముషమాగి మందహాసంతో వారి చిరునవ్వు ముఖాల్లోగల ఆనందాన్ని అవలోకించాడు. అతని కళ్లు చెమ్మగిల్లినట్లున్నాయి. దున్నుకోనేందుకు భూమి లేక— చేసేందుకు కూలిలేక—నిరుద్యోగంతో— ఆకలిమంటలతో వెళ్లబుచ్చిన తన యువ జీవితం గుర్తుకొచ్చింది కొబోలు.

ఉత్సాహంతో-ఉల్లాసంతో-ఉప్పొంగిపోతూన్న ఒక యువ కంఠం ప్రశ్నించింది. "కామ్రేడ్ బొబోయ్, మీ గతజీవితం ఎలా గడిచిందో మాకు కొద్దిగా చెబుతారా?"

"అదుగో...గతం...అక్కడే ఆగింది. మా చరిత్ర గమనమంతా-అదే. అటు పంజ్ నది కావలి ఒడ్డువైపుకు పరికించి చూడండి."

బొబోయ్‌చూపిన దిక్కు కందరూ తలలు త్రిప్పిచూశారు. పంజ్ నది మీదుగా అవతలివైపుకు తమ దృక్కులు సాదించారు. సంతాప చిహ్నంగా తలపై ముసుగు ధరించిన స్త్రీ మూర్తిలా దీనంగా, చైతన్యరహితంగా వుంది పంజ్ నది కవతలివైపు నున్న భూభాగం. అక్కడక్కడ సన్నంగా దారాలవలెనున్న పంట కాల్వలు - డొంకగట్లు కనుపించు తున్నాయి. అదే ఆఫ్ఘనిస్థాన్.

పడిపోయినగోడలు - చెదరిపోయిన కప్పు కూలిపోతూన్న గృహాలు పది - పన్రెండు మాత్రమే గల్గివున్న వారి గ్రామాలు శ్మశానంలా గున్నాయి. కనుచూపుమేరలో ఎక్కడా జనసంచారం లేదు. కాదు. ఎంతోదూరం. ఇంకెంతో ఓపికతో పరీక్షించి చూడండి. అదుగో! బక్కచిక్కిన నిరుపేద రైతొకడు తనకంటే బలహీనంగా ఎండి చిక్కిపోయివున్న ముసలిఎడ్ల జతను నాగలికిగట్టి తడిసే ఎరుగని ఆ ఆఫ్ఘన్ భూమిని దున్నటానికి ప్రయత్నించుచున్నాడు. ఆభూమిలో పంటలు పండించాలనే పట్టుదలతో, పిచ్చి ఆశతో చెమటకార్చి రక్తమోడ్చుతున్నాడు. పాపమతను జేసిన కష్టఫలితంగా ఉద్భవించిన పంట అతనికి దక్కుతుందో! దక్కదో?

సరిగ్గా అవే పరిస్థితుల్లో పెరిగిన బొబోకు చిన్నతనంలో తన తండ్రి - తాత అనుభవించిన కష్టాలను చవిజూసిన బొబోకు ఆఫ్ఘన్‌స్థాన్‌కు జెందిన ఆ బీదరైతుయొక్క ఆలోచనల నూహించడం అసాధ్యం కాదు.

అంతూ, దరీలేని కష్టాలననుభవించుతూ, భూస్వాముల దోపిడికి గురియగుచూ, అధికారుల అన్యాయానికి, అసభ్య ప్రవర్తనానికెరయగుతూ బాధాకరమైన జీవితాన్ని వెళ్లగడిపే ఆ నిరుపేద ఆఫ్ఘన్ రైతు ఎప్పుడైనా ఆశానయనాలతో పంజ్ నది ఈవలి ఒడ్డుకు సోవియట్ రష్యావైపుకు చూశాడంటే చాలు, పోలీసు లెదురౌతారు, లాటీలు శరీరమంతా హూనం జేసివేస్తాయి.

కాని పెద్దలు జెప్పిన సామెత వృధాగాదు. "నిప్పును గుడ్డలో మూటగట్టి దాయటం అసంభవం" చారిత్రక సత్యాన్ని ప్రజలనుంచి మరుగు పరచలేరు. భూస్వాముల దోపిడీలు — యజమానుల బూకరింపులు — అధికారుల నిరంకుశ ప్రవర్తనలు లేని వర్గరహిత సమాజం ఉద్భవించుట సంభవం. ఇది నిజం. పరమ సత్యం. సూర్యోదయంవలె సోవియట్ రష్యాలో ఉదయించింది. అది ఆఫ్ఘన్ ప్రజల నిరాశాంధకారాన్ని పటాపంచలు జేస్తోంది. వారిలో ఉత్సాహాన్ని — ఉద్రేకాన్ని గల్గించుతోంది. చేయవలసిన కర్తవ్యమేమిటో బోధించుతోంది. నేడు గాకున్న రేపైనా ఆఫ్ఘన్ ప్రజలు దోపిడీ దారులపీడనలనుండి విముక్తులౌతారు. మా పూర్వ జీవితంగూడా అలాంటిదే.

బొబోయ్ తన మాటల్ని ముగింపుచేస్తూ చివరి కిలా అన్నాడు. మన దేశంలోనున్న ఇరవైకోట్ల ప్రజల హృదయాల్లో దేదీప్యమానంగా వెలుగొందిన యీ స్వేచ్ఛాదీపాలు అంధకారంలోబడి దారితెలియక కొట్టుకలాడుతున్న కోట్లాది ప్రపంచ ప్రజలకు ముక్తిమార్గాన్ని చూపుతాయి. మహానాయకుడు లెనిన్ - కామ్రేడ్ స్టాలిన్ మనకీ అమరజ్యోతుల్ని ప్రసాదించారు. వారిచే నిర్మింపబడిన సోవియట్ ప్రభుత్వం చిరస్థాయి యగుగాక.

పెదవులమీద చిరునవ్వు నాట్యమాడుతూండగా బొబోయి ఇంటికి బయలు దేరేడు. తాను పనిజేసే సమిష్టి వ్యవసాయ క్షేత్రాలలోనూ, అనేక పరిశ్రమలలోనూ, దేశమంతటిలోనూ అధికోత్పత్తి కార్యక్రమాన్ని జయప్రదంచేసేందుకై నేనంటే నేనని ప్రజలు ముందంజవేయడం బొబోకు చిరపరిచితమే. ప్రభుత్వం తయారుజేసిన పంచవర్ష ప్రణాలికలను గడువులోపల పూర్తిజేయటంగూడా బొబోయ్‌కి చిరపరిచితమే. ఈరోజున 100 కి 100 మంది బోల్షివిల్ దీక్షతో తమ ఓట్లను పెట్టెలో వేయడం సామాన్యమైన పనిగానే కన్పించవచ్చును. కాని నూటికి నూరు అన్నది. ప్రపంచంలో అన్నిటికంటే బలవత్తరమైనది. ఎందుచేతనంటే యీ బోల్షివిల్ పోటీ సోవియట్ ప్రజలనెప్పుడూ ప్రతిరంగంలోనూ నాయకత్వంలో వుంచుతుంది.

(అనువాదం: శ్రీ రావెళ్ల హనుమంతరావు)

---









## శ్రీ నోరి నరసింహశాస్త్రి

## ౨3

> అమృతరసాభి వర్షకమయా శివకామసఖీకృపాకటా
> క్షమున మహోద్భుతక్రమ వశంవద నవ్యనిరూఢితో ఘ నా
> సమయమునన్ జనించె సరసస్మయమాన ముఖాంబుజంబుతో
> సుమశరశేఖరుండు జిగి సొంపున దొల్లిటికన్న మిన్నయై."
>
> కామసంజీవనము.

శిశిరఋతువు గతించినది,

వసంతము ప్రవేశించినది. ఏకశిలానగరమున వసంతోత్సవములు మహావైభవముతో నారంభమైనవి !

వసంతోత్సవమునకు మూలకందములైన మావులు చిగిర్చినవి ; అవి పూసినవి ; కాయలు కాసినవి. అవి ఎఱ్ఱగా తెల్లగా పచ్చగానుండి చూపర నాకర్షించుచున్నవి. తేనెటీగలు వానిపై మూగుచున్నవి, తుమ్మెదలు ఝుంకారము చేయుచు ప్రదక్షిణసంచారము లొనర్చుచున్నవి. కోయిలలు కవులతోపాటు పాడుచున్నవి !

నదులందును, సరస్సులందును నీరు తేటగానుండి స్నానపానాదులకు సుఖముగానున్నవి.

వినను శరత్కాలమువలెనే వసంతమును జీవులకు ప్రమాదకరమగు కాలము !

> "కాలుని దంష్ట్రియుగ్మ మనగా
> విలసిల్లు వసంతమున్ శర
> త్కాలము, ఘోరరోగమృతికారణ
> కారణముల్, బహుదుర్గమంబులౌ
> వేళలు సర్వజీవులకు, విశ్రుత
> భక్తి వివేక శాలురీ
> మూల మెఱింగి చండికకు బూజ
> లొనర్పు విశేష మత్తఱిన్."

ఇట్లని శ్రీభాగవత ముపదేశించుచున్నది. ఆ యుపదేశము జనులకు జనపతులకు దృఢముగా నాటుకొనియుండిన పుణ్యకాలమది. వసంతోత్సవము వసంతనవరాత్ర వ్రతముతో నారంభించును.

శ్రీ రుద్రదేవ మహారాజుల యభ్యర్థన ననుసరించి రాజగురువులగు శ్రీ విశ్వేశ్వరశంభు దేశికులు ముందుగనే అనేక శిష్యగణముతోగూడి రాజధానీనగరమునకు విచ్చేసి యున్నారు. వారి శివవాక్కులచే రాజ్యాభిషిక్తులైన శ్రీ రుద్రదేవ మహారాజులు, వారి యాశీర్వచనముతో రాజ్యభారమూని, పరిపాలన మారంభించినారు. ఈ యారునెలలో మహారాజుల కెన్నియో ఉపప్లవములు ఎదుర్కొనినవి. శ్రీ గురువుల కటాక్షముతోపాటు, పరమేశ్వరుని కటాక్షేక్షణమును, మహారాజులపై ప్రసరించి వారిని సర్వోపప్లవములనుండియు నుత్తరింపజేసినది. భగవంతునిపై భారముంచి, ధర్మ మనుష్ఠించువారికి, ప్రయత్నము వేల ఫలింపకుండును ? కాకతీయ సామ్రాజ్యముపై ఒక్కసారిగా తుపానవలె కష్టములు చెలరేగి శ్రీరుద్రదేవ మహారాజుల ప్రయత్నినను మహావాయువుచే విచ్ఛిన్నమైనవి. కాని యన్ని ప్రయత్నములందును, కంటికి కనపడకున్నను అనుభవమున స్పష్టముగా గోచరించుచు, శ్రీ శివగురు కరుణావలోకనము సిద్ధముగనే యున్నది. మహారాజులు ఒకవంక మహారాష్ట్రసేనలను వెన్నాడి పోవుచునే, విస్మరింపక రాజగురువులకును, సామ్రాజ్యమునం గల మహానుభావులకును ఆహ్వానములంపిరి. జన్నిగ గురువులగు శాంతపూర్వ శివదేశికులును వచ్చిరి.

నగరమం దెల్లెడల వరాహధ్వజములు చిరుగాలి కల్లలనాడుచు ఉత్సాహముతో కన్నుల పండువు చేయుచున్నవి. భూమండలమును తన దంష్ట్రాగ్రముతో నుద్ధరించిన యజ్ఞ వరాహమూర్తి స్వరూపమే అనాదిగా ఈ మధ్యభూమిరాజులకు ధ్యేయముగా నున్నది ; ప్రభుత్వ చిహ్నముగా నున్నది. వారివి వరాహధ్వజములు. వారి సువర్ణములు వరాహాంకితము లై అజ్ఞుల నోళ్ళలో బడి వరహాలైనవి.

స్వయముగా శ్రీ రుద్రదేవమహారాజులు విధి విధానముగా ఉపవసించి వసంతనవరాత్రపూజలు నిర్వర్తించుచున్నారు. స్వయముగా శ్రీవిశ్వేశ్వర శంభుదేశికులు మహారాజుల దక్షిణపార్శ్వమున నున్నతపీఠ మలంకరించి సమస్తము జరిపించుచున్నారు. నవరాత్రపూజలో ప్రాతఃకాలములందు కుమారీ పూజయు, సాయాహ్నముల సువాసిన్యర్చనయు, మహావైభవముతో సాగుచున్నవి. అట్టి మహారాజులు శ్రద్ధతో అర్చించునప్పుడే సహస్రనామముల సంపూర్ణప్రయోజనము ఘటిల్లును. ఒక్కొక్క కుమారికి, ఒక్కొక్క సువాసినికి, ఒక్కొక్క నామముతో పూజ జరుగుచున్నది. ఇట్లు సహస్రనామములకును కుమారికలు, సువాసినులు లభ్యమయినారు.

రాజమందిరమున రాజవైభవముతో నిట్లు పూజలు సాగుచుండ ఏకశిలానగరమున నాబాలగోపాలము వసంతోత్సవములు జరుపుచున్నారు. చిల్లర దేవతల గుళ్లనుండి కేశవ శ్రీ స్వయంభూ నికేతనములవరకు, ఉత్సవము యథాధికారముగా యథోత్సాహముగా సాగుచున్నది. ఇందరు దేవత లెక్కడ నున్నారు? ఈ పట్టణములో నింటికొక దేవతయున్నదా? ముప్పది మూడుకోట్ల మంది దేవతలును స్వర్గమునుండి నవరాత్రోత్సవము చూడ దిగి వచ్చినారా? అని శ్రోత్రవారి కనిపించును!

యువకవి యగు గోవిందశర్మతో పోయి వీథులు తిలకించి యాతని వర్ణన లాలకింతము!

అదుగో, పలినాటి వీరపురుష పరమదైవతములగు శివలింగ భవనవాటిలో నొకవనిత ద్విపదప్రబంధమున వారి వీరకథ పాడుచుండగా వీరులు కొందరు వీరసంబెట్ట వేయుచుండ, గొందరు కుంతాఖేలనము చేయుచున్నారు. ఒకడు ఘేట్కారము చేయగా, నొకడు గుజ్జము భంజళ్ళ బరపుచున్నాడు.

ఇక రేణుకా స్వరూపమగు ఏకవీరా మహాదేవి యాలయము ప్రాంగణముననో? బవనీడు పరశురామునికథ పాడుచుండగా, జనంగమ ప్రమద ఏమిచేయుచున్నది? గోవిందశర్మ వర్ణన యాలకింతము!

"అలరుంబోడి జనంగమ ప్రమద
మధ్యానద్ధఘంటాధ్వనుల్
చెలగం బాడె సమస్తలోక జననిన్
శ్రీ యేకవీరాంబికన్
వలరా జొక్కొక మూర్ఛనా
స్వరమునన్ ప్రాణంబు కల్పింపగా
గలకంఠీ కలకంఠ కోమల కుహూ
కారంబు తోరంబుగన్.

మరి జక్కులపురంధ్రి కామవల్లీ మహాలక్ష్మిఎదుట గైటభారి వలపును పాడుచు.

* * * *

"గిల్కు గిల్కున మ్రోయు కింకిణీగుచ్ఛంబు
తాళమానంబుతో మేళవింప
రాగముననుండి లంఘించు రాగమునకు
సరుచు యూరుద్వయంబుపై నొత్తిగిల్లి"
వచ్చుచున్నది. అటు చూతము!
"మంద్రమధ్య తార మానత్రయాభిన్న
మహిషశృంగినా దలహరి గూడి
డమరుడిండిమంబు ఢమఢమధ్వని మ్రోసె
నద్భుతం బదేమి యార్భటంబు!"

అది మైలారు భటుల సందడి! వారికెల్ల బొల్లడు అగ్రగామియై తన దళవాయి వేషము త్యజించి మైలారుభక్తుని రూపముతో సాగుచున్నాడు ఈనాడాతనికి 'అడసోకు' భయము లేదు. ఆ యుత్సవములో నిప్పుడు స్త్రీలు కూడ నున్నారు. ఆ యాడుచున్న గౌరవ పడుచునే మనుచున్నాడు. గోవిందశర్మ!

"వెనుకకు మొగ్గ్రవాలి కడు
విన్నను లొప్పగ దొట్టినీళ్లలో
మునిగి తదంతరస్థ మగు ముంగర
ముక్కున గ్రుచ్చి కొంచు తే
చెను రసనాప్రవాళమున శీఘ్రము
గ్రుచ్చెను నల్లపూసపే
రనుపమలమ నిప్పడు చుపాయము
లిట్టివి యెట్టి నేర్చెనో!"

అరుగు! వారికి కాకతీయభటులు ఎదురైనారు? వారికీనాడు గండడే అగ్రగామి! వీరికి వారికి ఈనాడు పోరు మరల పాసగునా? లేదు! కాకతీయ భటులును, మైలారు భటులును కలసి మెలసి కొంతదూరము ఊరేగి ఎవరిదారిన వారు పోవుచున్నారు.

ఆ భైరవ స్థానము చూడండి! గోవిందశర్మ భైరవుని వర్ణించుచున్నాడు!

"అమితోత్సాహముతోడ నీవు
పటు బాహా డక్క నొక్కక్క మా
టు మనః కంపమునొంద జేయ
దొలకాడున్ వార్ధి వేలాలుద
త్కమరం బై, వలమాన మీనమయి,
యుద్యన్నక్రమై, యత్తర
త్తిమియై, యుల్లల దంబు
మగ్న ధులియై, ధీరామహాభైరవా!?

ఈ మహోత్సవములో నెందర దేవతలను భక్తులను, దర్శింపగలము? చమడేశ్వరీ మహాశక్తి నగ రదిగో! అదే వీరభద్రేశ్వరాగారమండపము! అల్లదే బొద్దదేవుని విహారము! ముద్దరాలు మసానమ్మ నివాసము అదిగో! కుమారస్వామి నగ రదే! ఆపైన పాండవుల గుడి యల్లదిగో! అన్నింటికంటె పైగా, మన కన్నులున్నందుకు సార్థకత కల్పించుచున్న యా రెండుగోపురములు చూచితిరా?

"కాంతదవ్వుల నదె, మహాగోపురముల
పైడి కుండలు రవిదీప్తి ప్రజ్వలించి
కాన నయ్యెను మేరు శృంగముల బోలె,
కేశవశ్రీ స్వయంభూ నికేతనములు!"

వాని శిఖరదర్శనముతో జన్మములు పావనములైనవి. ఆ యాలయ ప్రాంగణమున కరణవిద్య నేర్చిన యారువేలమంది బ్రాహ్మణులును, ఇతర బ్రాహ్మణులగూడి వేద పారాయణము జేయుచున్నారు.

వీథుల సంచారము చేయుటచే, గోవిందశర్మ తాను శుచిగా నున్నట్లు భావింపక, ఆ యాలయములకు తొలగి వెళ్లుచున్నాడు. అతనికి పుష్పలావిక యెదురై.

"శివుని చిచ్చుఅకంట వెచ్చిన యనంగు
బూతి కెనయైన కమ్మ బుప్పొళ్లతోడ
దావి ఘనమైన కమ్మగేదంగి పూవు"

ఇచ్చినది. దానిమీద జాలితో గోవిందశర్మ పద్యము చెప్పుచున్నాడు.

"క్రొన్నెలరేఖతోడ గెడ గూడి
సుఖింపగ భాగ్య మబ్బమిన్
నున్నత నొందు గాని నవకేతకి
శూలి వివేకహీను డై
తన్ను దిరస్కరించుటకు దైన్యము
నొంద దదే వివేక సం
పన్నిధి దాని పాలి పెరుమాళ్లొక
డెక్కడ నైన లేడొకో!"

ఆ కేతకిని గ్రహించి యాత డభ్యాసవశమున వేశ్య వాటికలో ప్రవేశించి మాచల్దేవి మందిరము సమీపించినాడు అక్కడ.

"చందనంబున గలయంపి చల్లినారు
ముగ్గు లిడినారు కాశ్మీరమున ముదము

వ్రాసినా రిందు రజమున రంగవల్లి
కంజరముల దోరణంబులు గట్టినారు"

గోవిందశర్మను జూచినంతనే హంస తూలికా తల్పముమీద గూర్చున్న హావభావ విభ్రమ విలాసనిధి మాచల్దేవి లేచి.

"కంకణాలంక్రియాఝుత్కార మెసగ
నయ్యగారికి జోహారు లనుచు మ్రొక్కె."

"కవిగారూ, దర్శన మిచ్చి ఎన్నాళ్లయిన దండీ మీరు? ఉదయమునుండి మీకై దూతికపై దూతికను పిలువ బంపితిని. మీ జాడ కనిపింపలేదు. సరిగా వేళకు దయచేసినారు?"

"ఏమి పని?" ఇట్లనుచు తనచేత నున్న మొగలి చెండును మాచల్దేవి కీయగా నది మహాప్రసాదమని గ్రహించి యిట్లనెను.

"చెప్పెదను. రసజ్ఞులైన మీరు లేనిదీ యుత్సవ మింతవరకు శోభగా లేదు!"

"ఏమిటే యుత్సవము?—రాచకార్యము లైపోయినవా?"

"అదుదానికి రాచకార్యము లేమిటి? యోగివేషధరుని మోసముచే వచ్చిన ప్రమాదము తప్పుకొనుటకు పెట్టుకొన్న పని! ఈనాడు వసంతోత్సవ ప్రారంభముగా నూతన చిత్రశాలా ప్రవేశము చేసినాను! ఈ చిత్రశాలలో చిత్రములు మీరు చూడనిదే నాకు తృప్తి లేదు!"

అప్పటికే నగరములోని పెద్దలు పలువు రాచిత్రములు తిలకించుచుండిరి. గోవిందశర్మయు చిత్రములు పరికించి మాచల్దేవితో నిట్లన్నాడు!

"చిత్తజుని శౌర్య మెఱిగించె జిత్రశాల?"

మాచల్దేవి చిరునవ్వు నవ్వి గోవిందశర్మతో పని చెప్పెను.

"మీరు మదాలస నెరుగుదురు గదా, అది అన్నమంత్రీశ్వరుల ఇంట నృత్యమునకు తరచుగా వెళ్లెడిది! అది ప్రభుకార్యార్థినియై అంబదేవుని సేనల ననుగమించి, గుంటూరిలో జగన్నాథస్వామి యాలయములో శత్రుమధ్యమున నృత్య మొనరించి రంజింప జేసి, కాకతీయసేనల కెంతయో సహాయము చేసినది. దానికి మదనరేఖ యను చక్కని చెల్లెలు కలదు. దానిని నేను పెంచుకున్నాను. దాని కీనాడు ముకుర వీక్షణము జరుపవలసి యున్నది!"

గోవింద: "మన్య నే నెందుకు?"

మాచల్దేవి: "యువకవీ, నీకే నా యొక రహస్యము చెప్పెదను. నాయింటివారికి అనాదిగా కాకతీయ రాజన్యులతో చెలిమి పెలివేసికొని యున్నది. పెద ప్రోలరాజు నాటినుండియు మాపూర్వులిక్కడనే ఉండి ప్రభువుల యనుగ్రహము పొంది యున్నారు. నేను శ్రీగణపతి దేవమహారాజుల యనుగ్రహముచే పుట్టితి నందురు! నాజీవితము ఇట్లు వృథగా గడచి పోవుచున్నది. రాజవంశము వారిని దక్క మా వంశమువారు ఇతరుల నొల్లరు. కాకతీయవంశాంకుర మగు శ్రీ ప్రతాపరుద్ర కుమారులు వృద్ధినొందుచున్నారు. వారిని రంజింపజేయగల కుమార్తెను ఈ మదనరేఖ కనవలెనని నాకోరిక!"

గోవింద: "దానికీ ముకురవీక్షణమునకూ ఏమి సంబంధము?"

మాచల్దేవి: "మాకులమువారికి అద్దము శ్రీ మహాలక్ష్మి వంటిది. మరియు.

'పుణ్యచరిత్ర, దృష్టాంతభూమి గాదె
దర్పణమ్ము వివర్తవాదముల కెల్ల!'

గోవింద: "ఓహో బహు మంచిదానవే! శ్రీవిద్యాశంకర భారతీ యతీంద్రుల దక్షిణామూర్తిస్తోత్రము స్మరించినావా, 'విశ్వం దర్పణ దృశ్యమాననగరీతుల్యం...' పూజ్యుల వాక్కులు నీనోట నింకొక విధముగా వివర్తమే చెందుచున్నవి!"

మాచల్దేవి: "క్షమింపుడు! నాకూతురు మదనరేఖ మీకు కూతురువంటిది! వేదవిదులగు మీరు మీ చేతిమీదుగా దాని కిప్పుడు అద్దము చూపి దీవింపవలె! సరిగా లగ్నము సమీపించినది. అపరాహ్ణమైనది. మాకులమువారందరు కూడి నిరీక్షించుచున్నారదుగో!"

గోవిందశర్మ చిరునవ్వుతో నంగీకరించెను. జాయపనాయకుడు బద్దెనతో వచ్చెను. మరియు నగరి పెద్దలు పలువురు వచ్చిరి. మాచల్దేవి శీఘ్రగతి వారికి మర్యాదలు చేయించెను. జాయప కప్పటి విషయము తెలిసి యిట్లనెను.

"ముకురవీక్షావిధానంబు మొదలలేక
వెలపడంతికి గారాదు విభుని గవయ,
యా యజూకున కొల్లు చేయంగవచ్చు
నరణి సంగ్రహ మొనరింప కధ్వరంబు!"

కులమువారును నగరి పెద్దలును పరివేష్టించి యుండ గోవిందశర్మను ఉన్నతాసనమున గూర్చుండ జేసి మాచల్దేవి పూజించెను. అంతట వెలయాండ్రు మదనరేఖను చక్కగా నలంకరించి ఎదుటికి తెచ్చి యంతకుమున్నె సంపూజితమై యున్న రత్నముకురమును గోవిందశర్మ చేతి కిచ్చిరి.

గోవిందశర్మ మదనరేఖను దుహితృస్థానమగు తనకుడితొడపై కూర్చుండబెట్టుకొని, యాదరముతో దానికి చూచుకొనుటకు క్రొమ్మించుటద్దము చేతి కిచ్చెను. అదియు గోవింద శర్మకును, అద్దమునకును విలాసభంగి నమస్కరించి చేతఁబట్టి యద్దము చూచుకొనెను.

గోవిందశర్మ వెంటనే దాని చెవిలో 'శ్రీవర్ధస్వ' మంత్రము చెప్పి యక్షతలు చల్లి దీవించి దానిచేత పదునారు సువర్ణము లుంచి, మరియు నిట్లు అందరూ విన నాశీర్వదించెను.

"శ్రీ ప్రతాపరుద్ర ధరణీశోపాత్త గోష్ఠి ప్రతిష్ఠా పారణ యగు కూతురును శీఘ్రముగా కని కృతార్థురాలవగుదువు గాక!— దానికి మాచల్దేవి పేరు పెట్టవలె సుమా!"

మదనరేఖ సిగ్గుతో తల వాల్చెను. గోష్ఠియంతంతట నానా విధ నర్మోక్తులు సాగినవి. మాచల్దేవి యందరను గంధపుష్పఫల తాంబూలవస్త్రాదులతో పూజించెను.

చల్లబడుచున్నది. ఎదురుగా నున్న మామిడి చిగిర్చి పూచి కాయుచు వృద్ధుడగు జాయపనాయకుని దృష్టి నాకర్షించినది. అంతలో మేచయ నాయకుడు వచ్చెను. అతడు వచ్చుచునే మాచల్దేవి నుద్దేశించి.

'నీవు అదృష్టవంతురాలవు, నిన్ను కొంతకాలముగా కారాగృహమునకు పంపవలెనని యోజించుచున్నాను. ఈనాడే యోగివేషధారి యగు నా యవనచారునిపై దెచ్చుచున్న యభియోగములో నిన్ను ప్రధానసాక్షినిగా వేయ నిశ్చయించినాను. నీవు ప్రమాణము చేయుటకు ముకురము తీసికొని అధికరణ స్థానమునకు రావలసియుండును."

జాయప: "ఎప్పుడు?"

మేచయ: రేపు!"

జాయప: "బ్రదికించినావు. ఇప్పుడు నాకు సహకారభంజకోత్సవముపై మనసు పోయినది. దానికి విఘ్నము రాదుగదా!"

ఇట్లనుచు ఎదుటనున్న గున్నమామిడి నాతడు చూపినాడు. వెంటనే ఆ కూడిన నాగరకలోకములో నుత్సాహము బలసినది. అక్కడనున్న స్త్రీలును పురుషులును బారులు తీరినారు. మాచల్దేవి వసంతరాగాలాపనము చేసినది. అంతట నందరు లయాను

(18.వ పేజీ చూడండి)

నిపుణుల సలహాలు:

# కాబినెట్ల కార్ఖానా

"ఉంగారక షు"

కొన్నాళ్ళక్రిందట ఎసెంబ్లీ కాఫీ హోటల్‌లో ఒక అపూర్వవ్యక్తిని కలుసుకున్నాను.

మామూలుగా హోటలుకువెళ్ళి కావలసినవి చెప్పి, యాదాలాపంగా దిక్కులు చూస్తూ కూర్చున్నాను. ఇంతలోకే వచ్చిపడ్డారు ఒక గుంపు. కొందరు ఎసెంబ్లీ సభ్యులూ, వారి పరివారమూ. హోటల్ వాళ్ళకు వాళ్ళ రుచులేమిటో బాగా తెలుసు. కనుక, ఏంకావాలో అడిగే జెడద లేకుండా, సరాసరి ఒక పెద్ద వాదంలోకి దిగారు. ప్రభుత్వపు ఆదాయం పెరగటానికి వ్యవసాయంమీదనే ఎక్కువ పన్నులు వేయాలా, లేక పరిశ్రమలమీదనే వేయాలా అనే సమస్యమీద వాద ప్రతివాదాలు ప్రారంభమైనవి. ప్రభుత్వం షావుకార్లతో లాలూచీఅయి రైతుల్ని నిరాదరిస్తున్నదని కొంతమందిఅంటే, రైతుల వోట్లకోసం ఆశపడి పరిశ్రమలను ఉపేక్షిస్తున్నదని మరికొందరు అన్నారు. ఈ తర్జనభర్జనలు అంతకంతకూ పెరిగిపోయి, హోటల్‌కప్పు లేచిపోతుందా అన్న పరిస్థితిలో నాకు నవ్వు ఆగలేదు. ఎంతో కష్టంమీద దానిని ఆపుకుంటూ ముఖం మరోవైపుకి తిప్పేటప్పటికి, నా అవస్థే పడుతున్న మరొకవ్యక్తి కనిపించాడు. ఒకళ్ళ సంగతిని ఒకళ్ళు గుర్తించినట్లు కనుబొమ్మలు ఎగరవేశాము.

ఇంతలో సర్వర్లు సరుకులను తెచ్చి మమ్మల్ని ఉద్ధరించారు.

ఆ క్రొత్తవ్యక్తి కాఫీని పూర్తిచేసి "టౌన్‌కి వస్తున్నారా" అని అడిగాడు. అవునండీ, అక్కడికే నంటూ నేనూ బయటికి వచ్చాను.

"ఏమండీ మీరు 'విశ్వరూపం' విలేకరులు కాదా?" అని ప్రశ్నించాడు.

అవునని ఒప్పుకున్నాను.

"అబ్బబ్బ! ఎంత ఘాటుగా వాదిస్తారండి, వాళ్లు! కాని, ఈధాటీ ఎసెంబ్లీలో కనిపిస్తే ఎంత సంతోషించేవాళ్ళం?"

"పార్టీ విప్ ఉంటాడుగా, కొరడా చేతబుచ్చుకుని" అని నేను సమర్థించాను.

"ఆ మాట నిజమే ననుకోండి. అయినా ఈ వ్యవసాయ పార్టీవాళ్ళను చూడండి. కళ్ళ ఎదటవున్న భారీపరిశ్రమను వదిలేసి ఉండీ లేనట్లుగా ఉన్న చిన్న పరిశ్రమల వెంటబడి వాటిమీద తలకుమించినపన్నుల్ని రుద్దమంటారు"

"మీరు మాట్లాడేది ఏ పరిశ్రమలను గురించి?"

"కాబినెట్ల కార్ఖానాలను గురించి"

"వాటిని మాత్రం ప్రభుత్వం ఏమి వదిలిపెట్టింది? అసలే కలప దొరకటంలేదనీ, ఆ పైన—"

"అరే! మీరింకా పెరటిదోవనే వున్నారు. ఈ కార్ఖానాలమీద ప్రభుత్వం పన్నులు వేయలేదు సరికదా, అవి విధించే పన్నుల్ని చెల్లించుకుంటేచాలు. ఆ కార్ఖానాలు పని మొదలుపెడితే ఈ కాబినెట్లూ, కౌన్సిళ్లూ, ఎసెంబ్లీలూ అన్నీ అల్లకల్లోలం కావలసిందే. తమను తయారుచేసే కార్ఖానాలమీద కాబినెట్లు పన్ను లెక్కడవిధించగలవండీ?" అని ఆయన నవ్వటం మొదలుపెట్టాడు.

అప్పుడు నాకూ అర్థమై నేనూ నవ్వాను.

"కాబినెట్ నిర్మాణ పారిశ్రామిక మండలిలో నేనొక సాధారణ సభ్యుణ్ణని చెప్పుకోటానికి గర్విస్తున్నాను. మీకు వేరే పనేమీ లేకపోతే, మా పరిశ్రమను గురించి నాలుగు ముక్కలు చెప్పటానికి కుతూహలపడుతున్నాను."

"ఓ, అంతకన్నా కావలసిందేమిటి?" అని జవాబిచ్చాను.

* * * *

టౌన్‌లో ఒకముచ్చటయిన భవనంలోకి ఆయన నన్ను తీసుకుని వెళ్ళాడు. చక్కగా కుర్చీలు, ఫ్యానులు అమర్చిన గదిలో కూర్చోబెట్టాడు. ఆ గదికి అంటుకునే వున్న మరొక చిన్నగదిలో ఒక టెలిఫోనూ, ఒక ఇనప్పెట్టె, అక్షరాలవరసలో పేర్చిన షెల్ఫులూ ఉన్నవి.

"మా కార్ఖానా ఇదేనండీ." అన్నాడు.

"అంత వ్యవహారమూ ఇక్కడే జరుగుతుందన్నమాట" అని నేను అందుకున్నాను

"అవును. ఇక్కడే మా కార్యక్రమంలో మొదటి ఘట్టం, చివరి ఘట్టం ఎక్కువగా జరపబడతవి. ఇక్కడే కాబినెట్లు స్థాపించబడి, కొన్నాళ్లు నిలబెట్టబడి, చివరకు లాగివేయబడతవి. ఇక్కడే మంత్రులు గద్దె ఎక్కించబడి, కొన్నాళ్లు తైతక్కలాడించబడి, చివరకు కిందికి దొర్లించబడతారు. ఇక్కడే పార్టీలనుకూడ గట్టటం, కథలు నడిపించటం, మళ్లీ చీల్చి వేయటం జరుగుతుంది. సృష్టి, స్థితి, లయం— జగన్నాటకరంగం యావత్తూ, ఇక్కడ నడిచిపోతుంది." అని ఆయన గంభీరంగా అన్నాడు.

"మీరు కొంచం వేదాంతుల మోస్తరు ఉన్నారే?" అన్నాను.

"వేదాంతులు కాని వాళ్లెవరు? ప్రతి పార్టీకి కొన్ని సిద్ధాంతాలూ, ప్రతిసంస్థకూ కొన్ని తత్వాలూ ఉండక తప్పదుకదా."

"మీరు కోపంరాకుండా ఉంటే ఒకటి అడుగుతాను. మీ పరిశ్రమ ప్రభుత్వాలకు నిలకడ లేకుండా చేసి ప్రజాస్వామ్యాన్ని బలహీనపరుస్తుందేమో ?"

"ఊహు! పైపెచ్చు బలపరుస్తుందికూడా. అసలు ప్రజాస్వామ్యం అంటే అధిక సంఖ్యాకుల పరిపాలనేకదా. ఒకే కాబినెట్ ఎక్కువకాలం అధికారంలోఉంటే, అది ఒక ప్రత్యేకవర్గపు నియంతృత్వం అవుతుంది. ఆ ప్రమాదం ఏర్పడకుండా నివారించటానికి మనం అడపా దడపా కాబినెట్లను మారుస్తూ ఉండాలి."

"మీరు చెప్పింది కొంతవరకూ నిజమే కాని, ఇష్టంవచ్చినట్లు—"

"లేదు. మేము ఇష్టంవచ్చినట్లు ఏపనీ చేయం. ఎంతో మెలకువతోనూ, జాగ్రత్తతోనూ పనిచేస్తాం. కనకనే ఎప్పుడూ మా దెబ్బ గురి తప్పదు."

"సరే. మీ పరిశ్రమలవల్ల ప్రజాస్వామ్యం ఎట్లా బలపడుతుందో వివరించండి."

"ప్రజాస్వామ్య సిద్ధాంతకారులు ఏం చెప్పారో గమనిస్తే, మీ సందేహం తొలిగిపోతుంది. ప్రజాస్వామిక వ్యవస్థ స్థిరంగానూ, లోపరహితంగానూ ఉండాలంటే, బాధ్యతను గుర్తించి స్వేచ్ఛగా నడవగల ప్రతికూలపక్షం ఉండటం అవసరమని వాళ్ళంతా చెపుతున్నారు. ఒకే ప్రభుత్వం ఎక్కువకాలం అధికారంలో ఉంటే ప్రతికూలపక్షం క్రమక్రమంగా బలహీనపడక తప్పదు."

"మీరు మరీ అతిశయోక్తి చేస్తున్నారు."

"అయితే మీకొక ఉదాహరణ చూపిస్తాను. బ్రిటన్‌ని తీసుకోండి. అక్కడ లేబర్ ప్రభుత్వం లార్డ్స్ సభ అధికారాలను కత్తిరించి పారేస్తున్నది. పాపం, ఇప్పుడు లార్డ్స్ సభ ఏ బిల్లునయినా ఒకఏడాదివరకు మాత్రమే నిలిపి ఉంచగలదు. లార్డ్స్‌సభలో బలంగావున్న కన్సర్వేటివ్‌లకు ఇది పెద్ద దెబ్బ అయింది. మరొక విషయం చూడండి

(19-వ పేజీ చూడండి)



భారదాస్యానికి స్వస్తిచెప్పి, భారతిని దాస్య శృంఖలాలనుంచి విముక్తిగావించి దేశాన్ని స్వతంత్రంగా చేసుకున్న పర్వదినం వచ్చింది.

వాడవాడలా, పల్లెపల్లెలా, వీధివీధులా, ఇంటింటా అశోకచక్రయుత జాతీయ త్రివర్ణపతాకలు పచ్చటి తోరణాలతో అలంకరించి, జయభేరులతో, మంగళగీతికలతో మాతృస్తవము చేసే పర్వదినమిది.

ప్రతి భారతీయుని హృదయం ఆనందంతో పరవళ్లుత్రొక్కి సభల్లో, సమావేశాల్లో పాల్గొని తన్మయం పొందే సుదినం.

ప్రసాదు పావిట్లో కుక్కిమంచంలో మధ్యగా కూర్చొని మాసిన గడ్డాన్ని వేళ్ళతో తడుముకుంటూ ఇంటికప్పుపై దృష్టినిగిడ్చి ఏమో ఆలోచిస్తున్నాడు.

శ్రీ సింగరాజు లింగమూర్తి

"అమ్మమ్మా..నాకు జ్వరం ఎప్పుడు తక్కువైతుందే?" అని తన కుమారుడు ముద్దుమాటలతో పక్కగదిలోంచి ప్రశ్నించడం విని దృష్టిమరల్చి గదివైపుకు చెవులు నిగిడ్చాడు ప్రసాదు.

"తగ్గుతుందిబాబూ.. తగ్గుతుంది... వెంటనే తగ్గుతుందా మరి"

"అమ్మమ్మా...నాన్నను డబల్ రొట్టి తెమ్మనవే"

ఆమాటలు వింటుంటే ప్రసాదం తన చేతకానితనానికి నొచ్చుకున్నాడు. హృదయం బాధావహమైంది. ఇక అక్కడ కూర్చోలేక పోయాడు. మంచంమీదనుంచి లేచి, పైన ఉత్తరీయం వేసుకుంటానికని బట్టల స్టాండుదగ్గరకు వెళ్ళాడు. అక్కడే ఎదురుగా గోడమీదవున్న భార్యఫోటో మీద అప్రయత్నంగా అతని దృష్టిపడింది. క్షణకాలం అలాగే స్తబ్దతగా నిలబడ్డాడు. కళ్లల్లో నీళ్ళు గిర్రున తిరిగాయి "క్షమించు సుమతీ... నామూలంగా బలియైపోయావు... మన నోములపంటను నీ బంగారు కొండను కాపాడే శక్తినియ్యి సుమతీ" అంటూ ఉత్తరీయంతో కళ్లు తుడుచుకున్నాడు. ఫోటోలో సుమతి చిరునవ్వు, అరమోడ్పుకళ్ళలో చిందులాడే చల్లదనం ప్రసాదును కొంత ధైర్యపరిచాయి. చరచరా వీధిలోకి వెళ్ళిపోయాడు.

* * *

ప్రసాదు బి. ఎ. చదువుతూండగానే తండ్రి మృతిచెందాడు. ఆ సంవత్సరంలోనే సుమతి కాపురానికి వచ్చింది. పరీక్షలు అవడంతోనే స్వగ్రామం వచ్చాడు. ప్రసాదు భారతమాత దాస్యపు మూల్గులు, బీదప్రజల ఆర్తనాదాలు అతణ్ణి ఉద్వేగపరిచాయి. స్వాతంత్ర్య సమరానికి ముందంజ వేయండనే గాంధిమహాత్ముని శంఖారావం ప్రసాదును పులకితుణ్ణి చేసింది. అప్పటినుంచి జాతీయోద్యమంలోదిగి, అవిరళ కృషిచేసి 16 గ్రామాలకు నాయకుడై, జిల్లా ఉద్యోగులను గడగడ లాడించాడు దేశమంతటా సత్యాగ్రహోద్యమం ప్రారంభమై అచంచల దీక్షతో సాగుతున్నది. ప్రసాదు తన 16 గ్రామాల స్వచ్ఛందకులతో సత్యాగ్రహం ప్రారంభించాడు. గ్రామగ్రామంలో జాతీయ పతాకాలను ప్రతిష్ఠాపిస్తూ ముందుగ్రామానికి సాగిపోతున్నాడు. ప్రభుత్వదండు ప్రసాదును వెన్నాడి, అతను ప్రతిష్ఠాపించిన పతాకాలను పెరకివేస్తూ, కొంతమంది స్వచ్ఛందకులను పట్టుకుంటూ, ప్రసాదును అరెస్టు చేయటానికని అతని వెనకనే దొంగదారుల నుండి ముందుకు పోతున్నారు. ప్రసాద నిలబడి గంభీరంగా ప్రసంగిస్తుంటే బాలుర సైతం ఉద్రిక్తులై సత్యాగ్రహులలో పాల్గొని జయ జయ నినాదాలు చేస్తు ఉద్యమాన్ని ముందుకు తీసుకుపోతున్నారు ప్రసాదును పట్టుకోలేక పోలీసులు విసి

వేసారి పోయారు. ప్రసాదు జిల్లాలోగల 24 గ్రామాలలో జాతీయ పతాకల నెలకొల్పి, యువకులను ఉద్రిక్తపరచి, జిల్లా కోర్టుముందు స్వచ్ఛందకులతో సత్యాగ్రహం జరుపుతూ తానే స్వయంగా పోలీసులకు పట్టుబడి జైలుకు వెళ్ళాడు. జైలులో కూర్చున్న తర్వాత తన ఇల్లు, సంసారం స్ఫురణకు వచ్చింది.

ప్రసాదుకు చెప్పుకోదగిన పెద్ద ఆస్తిపాస్తులేమీ లేవు. కొంత తన బి. ఏ. పట్టాకే అయిపోయింది. మిగిలిందాంట్లో చాలాభాగం జాతీయోద్యమానికే వినియోగించాడు. ప్రసాదు జైలుకు వచ్చేముందు తల్లి జబ్బుతో వుంది. సుమతి నిండు గర్భవతి. కాస్త చేయూత నిచ్చే బంధువులు కూడా ఊళ్ళో లేరు. అటువంటి పరిస్థితులలో అతను జైలుకు వెళ్ళాడు. అతణ్ణి ఒక జైలులోకాక, దేశంలోని ఇతర పేరుమోగిన జైళ్ళలోకూడా తిప్పేవారు. అందువల్ల ప్రసాదుకు, అతని కుటుంబానికీ అంతగా ఉత్తర ప్రత్యుత్తరాలు జరగడానికికూడా అవకాశంలేక పోయింది. ప్రసాదు ఎంత ధైర్యశాలియైనా, కన్నతల్లి, కట్టుకున్న భార్యా తలపునకు రావడంతో హృదయం బ్రద్దలయేట్టు దుఃఖిస్తూ అలాగే జైలు జీవితం గడిపాడు.

దేశం స్వతంత్రమైంది. రాజకీయ ఖైదీలను విడుదలచేశారు. ప్రసాదు తిరిగి ఇంటికివచ్చాడు. కాని అతనికి ఆనందానికి బదులు విచారమే అయింది. తల్లి అసువులు బాసింది. భార్య జబ్బుతో ఉంది. పుట్టిన పిల్లవాడు సీతలాగున్నాడు. ఇంట్లో పూట జరగటమే కష్టమైంది. నోటి మంచితనాన అలాగే సంసారాన్ని జరుపుకుంటూ వస్తున్నాడు. రోజురోజుకూ సుమతికి జబ్బు పెరగటమేకాని తగ్గటమంటూ లేకపోయింది. తగిన మందు వాడకపోతే ప్రయోజనంలేదని డాక్టరు సలహా ఇచ్చాడు. ప్రసాదుదగ్గర చిల్లిగవ్వ లేదు. దేశంలో ఎన్నోమార్పులు వచ్చాయి. తనతోటి జాతీయవాదులంతా పెద్దపెద్ద ఉద్యోగులయ్యారు. తను ఉద్యోగానికి దరఖాస్తు చేస్తే పరిశీలించే దిక్కు లేక పోయింది.

ప్రసాదు ఆత్మాభిమానం కలవాడు. ఒకళ్ళముందరనిల్చి చేతులు నలుపుకుంటూ కాళ్లావేళ్లాపడి పని నెరవేర్చుకొనే ఆత్మవంచకుడుకాదు. తోటిమానవునికి సహాయం చేయడమే తన పరమధర్మంగా భావించి ఆచరించేవాడు. ఎవరన్నా కష్టంలోగానీ ఉన్నారంటే తన శాయశక్తులా సాయపడేవాడు. అతని సేవాతత్పరతకు అందరూ ఓహోహో అనే వారేకానీ అతనికి కష్టం వచ్చినప్పుడు తమకేమీ తెలియనట్టూ, సంబంధంలేనట్టూ నటిస్తారు. ఎక్కడైనా సభలు జరుగుతున్నాయంటే రెక్కలు కట్టుకొనివెళ్ళి వాలేవాడు. ఫలానా సభకు వచ్చి ఉపన్యసించండని ఆహ్వానించినా, ప్రసాదుకు రైలుఖర్చులైనా ఇచ్చేవారు కాదు.

రోజులు గడుస్తున్నాయి. సుమతి ప్రమాదావస్థకు వచ్చింది ప్రసాదు హృదయానికి శాంతిలేదు. ఏ నిమిషం ఎలాఉంటుందోనని భయపడసాగాడు. మందూమాకుల కోసం, స్నేహితుల్ని సహాయంచేయమనీ, తర్వాత తీర్చుకుంటాననీ ప్రాధేయపడ్డాడు. కాని అతని మొరలాలకించేవారు లేకపోయారు. తన ప్రియమైన భార్యకు మందుఇప్పించే శక్తిలేని తన దౌర్భాగ్యాన్ని నిందించుకున్నాడు. సుమతి ఆ పసికందుని, ప్రియభర్తను వదిలి కళ్లుమూసింది. ప్రసాదు ఆ పసికందుని హృదయానికి హత్తుకొని దిక్కులేని పక్షిలా విలపించాడు. సుమతి గతించాక, ఇంక తను బ్రతికేందుకని విరక్తి పడ్డాడు. కాని ఆ పసికందు గతేమిటని ఆలోచించి తనకు తానే ధైర్యం తెచ్చుకున్నాడు. బంధుత్వం ఉండటంవల్ల, అత్తగారికి వేరే బాదరబందీ లేకపోవటంవల్లా, ప్రసాదు అత్తగారు బిడ్డను పెంచుతూ అతని ఇంటనే ఉండిపోయింది.

ప్రజామంత్రులు రావడంతో, వారి అండతో ఎన్నోకార్యాలు చక్కపెట్టుకొని ప్రసాదుమిత్రులు వందలూ వేలూ ఆర్జిస్తుంటే ప్రసాదుకు ఆశ్చర్యం, అసహ్యం కూడా కలిగింది. "ఇది మోసం, అన్యాయం" అని ప్రసాదు మిత్రులతో వాదించేవాడు, "ఓరి పిచ్చివాడా! నీ సిద్ధాంతాల ప్రకారం నడిస్తే మేమూ నీలాగే తయారై, ఒకరిదగ్గరకువెళ్ళి చేయి జాపాల్సివచ్చేదే" నని యెద్దేవాలు చేసేవారు. "ఈరోజుల్లో న్యాయం, ధర్మం అని కూర్చుంటే, మన పని పిట్టంగట్టాల్సిందే" ననికూడా వాళ్ళు ప్రసాదును హెచ్చరించారు. కాని ప్రసాదుకు వారి తత్వం నచ్చలేదు.

రాజకీయ బాధితులకు భూప్రదానం అని ప్రభుత్వం ప్రకటించింది. మిత్రుల ప్రోద్బలంతో ప్రసాదుకూడా తన కృషిని, తను స్వాతంత్ర్యోద్యమంలో తిరిగి ఎన్నిసార్లు జైళ్లకు వెళ్ళిందన్నీ వివరిస్తూ దరఖాస్తు పెట్టుకున్నాడు. ప్రభుత్వ భవనాలచుట్టూ, ఉన్నతాధికారులచుట్టూ తిరిగి, కాళ్లా వేళ్లాపడీ, లంచాలుపోసి, లేక వస్తురూపేణా లంచాలిచ్చి చాలామంది మంచిమంచి భూముల్ని సంపాదించారు. ప్రసాదు దరఖాస్తు పెట్టుకున్నాడేకాని ఎవరినీ ఆశ్రయించలేదు. కాళ్ళావేళ్ళా పడలేదు. ఏరూపేణా లంచంకూడా ఇవ్వలేదు. అధమం వారిని కలిసి, నీవు ఇంద్రుడవూ, చంద్రుడవూ అనీ, దానకర్ణులనీ, స్తుతించనైనా లేదు. అందుచేత ప్రసాదుదరఖాస్తు చెత్తబుట్టపాలే అయింది.

భుక్తి గడవటంకోసమని ఉద్యోగానికి ప్రాకులాడాడు. బ్రాహ్మణవంశంలో పుట్టకపోయి నట్లయితే ఉద్యోగం సులభసాధ్యమే అయేదికానీ, బ్రాహ్మణుడవడంచేత ఉద్యోగం దొరకడం కష్టమే అయింది. తప్పనిసరిగా ఉద్యోగం చేయవలసి రావడంతో ఓ పత్రికాలయంలో చేరాడు, వచ్చేజీతం ఇరవైరోజులకైనా చాలేదకాదు. యజమాని అహంకారానికీ, నీచప్రవృత్తికీ తొందరలోనే ఉద్యోగానికి తిలోదకాలిచ్చాడు.

ఇప్పుడు ఇల్లుజరగడమే కష్టమైపోయింది. స్వాతంత్ర్యంవచ్చి మూడు వసంతాలు గడుస్తున్నాయి. ఈమూడు వసంతాలలోనూ దేశంలో ఎన్నో మార్పులు జరిగాయి. కాని ప్రసాదు జీవితంలోమాత్రం భార్యావియోగం, తత్సంబంధ క్లేశాలూ తప్ప ఆర్థికంగా మార్పేమీ లేదు. ప్రసాదులో నేకాదు అతనిబోటి మధ్యతరగతి ప్రజానీకంలోకూడా చెప్పుకోతగ్గ మార్పేమీ రాలేదు. ప్రసాదు ప్రియమిత్రుడు రామం లేకపోయినట్లయితే ఏనాడో విరక్తితో అసువులు బాసేవాడు. గ్రుడ్డిలో మెల్లలా, ప్రసాదుకంటే రామం కాస్తకలవాడు. ప్రసాదు ఆదర్శాలనూ,మనోగతాభిప్రాయాలనూ అర్థం చేసుకున్న వాడవటంవల్ల రామం అతనికి అండగా ఆర్థికంగా సహాయపడేవాడు. రామం సహజంగా ఉద్రేకి. మొహంఎదుట వారిలోని కుళ్ళును బయటపెట్టి విమర్శించేవాడు. రామం ప్రసాదుకు కడిభుజంగా ఉన్నాడనే నెపంతోనూ, అతని నిష్పక్షపాతవిమర్శనలు తమకే వేళప్పుడు హాని కూరుస్తాయోననీ కొంతమంది పెద్దలు, ప్రభుత్వ ఏజంట్లు అతనికి కమ్యూనిస్టు అనే బిరుదుక్రింద కొన్ని కల్పిత నేరాలుమోపి జైలుకు పంపారు.

దానితో ప్రసాదుకు రామం అడంపోయింది. ఇదీ ప్రసాదు వెనకటి గాథ.

••• ••• •••

ప్రసాదు ఇంటినుంచి బయలుదేరి వీధుల వెంట నడుస్తున్నాడు. అడుగులు నీరసంగా పడుతున్నాయి. పాపం... ప్రసాదు కడుపునిండా తిండితిని రెండురోజులైంది. పైగా కన్నకుమారునికి తీవ్రజ్వరం. డబ్బురొట్టికావాలని కుమారుడు అమ్మఅమ్మను కోరిన స్వల్పకోరిక, తన అసమర్థతా మొదలైన ఆలోచనలే అతను నడుస్తున్నా బుర్రలో రేకెత్తుతున్నాయి. తన అసమర్థతవల్లే తన ఆత్మేశ్వరిని బలిచేశాడు. ఇప్పుడు కుమారుడు......కాదు కాదు...అదెన్నటికీ కాజాలదు...అమంగళం ప్రతిహతం అవుగాకయని ప్రసాదు మనస్సులోనే అనుకొని. చిట్టితండ్రిని చిరంజీవిగా చేయమని తాను నమ్మిన భారతమ్మనే ప్రార్థించాడు.

ప్రసారు తన కుమారుని కాపాడాలంటే, తన కుమారుని భావి భారతపౌరుని చేయాలంటే, తనకు ఉద్యోగం దొరికి జీవితం ప్రశాంతంగా జరగాలంటే ఒక్కటే మార్గం ఉందని ప్రసాదుకు తెలుసు. "నీవు నేను చెప్పినట్లువింటే నీకు నిమిషంలో మంచి ఉద్యోగం దొరుకుతుంది. కావలసినంత డబ్బు వస్తుంది...నా పిల్లని చేసుకో...ఆలోచించు" అని ఒక పెద్దనాయకుడు, ఇప్పడొక ఉన్నతోద్యోగి లోగడ అన్నమాటలు ఇప్పుడు మరొకసారి అతనికి వినిపించాయి.

ఆ ఉన్నతోద్యోగి కూతురు కూడా బి. ఏ. చదివింది. ఆమె దృష్టిలో పురుషులంటే స్వార్థపరులనీ, "వాళ్ళు మన కాళ్ల బూట్లను తుడవడానికికూడా అనర్హు" లనీ మహిళా సభల్లోనూ, స్త్రీ అభ్యుదయ పత్రికల్లోనూ ఏకరువుపెట్టి, వివాహం చేసుకోనని ప్రతిజ్ఞ పట్టింది. చివరికి ప్రకృతికిలొంగిపోయి. సహజదగా యౌవనంలో కలిగే కామోద్రేకాన్ని అరికట్టలేక, ఓరాత్రి ఓ యువకునికి దాసోహమంటూ లొంగిపోయింది. తనప్రజ్ఞ తలపునకు రావడంతో కోల్పోయిన శక్తికోసం ప్రాకులాడింది. కాని ఏం లాభం? కాలుజారిన ఫలితంగా గర్భవతియై, తోటివాళ్లలో తలెత్తలేమనే కారణంగా రహస్యంగా గర్భవిచ్ఛిత్తి చేసుకొని, సంఘంలో తలెత్తుకుతిరిగే చదువుకున్న విశాలహృదయంలేని మహిళ. పాపం దాగదన్నట్టు ఈ రహస్యం బట్టబయలే అయింది. అయినా ఆ ఉన్నతోద్యోగిముందు నోరెత్తేవారెవరు? కాస్త ప్రసాదుకు దూరపు బంధుత్వంవల్లా. కూతురు వివాహానికి అంగీకరించటంవల్లా ఆ ఉన్నతోద్యోగి ప్రసాదును తన అల్లుని చేసుకుందామని కుతూహలపడ్డాడు. ప్రసాదు నిరాకరించాడు. తనూ్మలంగానే కష్టపడ్డాడు. పరిస్థితులు అనుకూలంగా లేకపోవడంతో ప్రసాదు తన అంగీకారాన్ని ఆ ఉన్నతాధికారికి తెలుపుదామనే ఇంటినుంచి బయలుదేరాడు. తనకింతకంటే గత్యంతరం లేదనికూడా తెలుసుకొనే సాహసించాడు.

ప్రసాదు వీధులవెంట నడుస్తున్నాడు. వీధివీధులా అశోకచక్రయుత త్రివర్ణపతాకలు పచ్చటి తోరణాలతో అలంకరించి ఉన్నాయి. ముఠాలు ముఠాలుగా కాంగ్రెసు వాలంటీర్లు జాతీయ గీతాలు పాడుకొంటూ తిరుగుతున్నారు. ఇవన్నీ తనను పట్టనట్టే ప్రసాదు ఆ ఉన్నతోద్యోగి ఇంటికివెళ్ళాడు. ఆ ఉద్యోగి కూతురు చిరునవ్వుతో గుమ్మంలోనే స్వాగతమిచ్చింది. తెచ్చిపెట్టుకున్న నవ్వుతో ప్రసాదు ఆమె స్వాగతాన్ని స్వీకరించే లోనికి వెళ్ళాడు. ఆ ఉన్నతాధికారికి తన అంగీకారం తెలియజేసి పరిస్థితిని వివరించాడు. వెంటనే ఆ అధికారి డాక్టర్ను పిలిపించి "ప్రసాదూ తొందరగా తిరిగిరా, ఇప్పుడు నీవు బహిరంగసభలో ఉపన్యసించాలికాబోలు" అన్నాడు. "క్షమించండి...ఇక ఎక్కడా, ఎప్పుడూ ఉపన్యసించను...అది మినహా మీరు చెప్పినట్లు వింటా" నని సెలవుతీసుకొని బాధాహృదయంతో డాక్టరువెంట వెళ్ళాడు. ప్రసాదు ఉపన్యసించనని విరమించుకున్నా గ్రామంలో అంతా అతని ఇంటికివెళ్ళి బలవంతాన తీసుకువచ్చి సభలో ప్రసంగించమన్నారు. ఆ ఉన్నతాధికారే అధ్యక్షపీఠాన్ని అలంకరించాడు. ప్రసాదు దేశంలో ఇప్పుడున్న యథార్థస్వరూపాన్ని తన ప్రసంగంలో వివరించాడు. అతని గంభీరోపన్యాసానికి ప్రేక్షకులు శహబాస్ అంటూ కరతాళధ్వనులు చేశారు. తర్వాత అధ్యక్షుడు ముగింపులో ప్రసాదు కార్యదక్షతను, అతని విశాల హృదయాన్నీ, ప్రస్తుత పరిస్థితినీ వివరిస్తూ, త్వరలోనే అతనిని తన అల్లునిగా చేసుకొనే భాగ్యం కలుగబోతున్నదనీ అన్నాడు. "శుభస్య శీఘ్రం...ప్రసాద్ జిందాబాద్" అంటూ సభికులు నినాదాలు చేశారు.

ప్రసాదు తన ఆత్మద్రోహానికీ, ఆత్మవంచనకీ సిగ్గుపడి, తలవంచుకొని నిట్టూర్చాడు.





# రుద్రమదేవి

(13-వ పేజీ తరువాయి)

కూలముగా నడుగులు వేయుచు నామావిగున్నకు ప్రదక్షిణము చేసినారు. ముమ్మారు ప్రదక్షిణమైన పిమ్మట వలయాకారముగా నందరు దానిని పరివేష్టించినారు. వసంతరాగమున గీతము సాగుచునే యున్నది!

లయతప్పకుండ ఒక్కొక్కరే ముందుకు సహకారము క్రిందికి చేరి, ఎగిరి నోటితో దాని పిందెలు గ్రహింప నుంకించుచున్నారు. అటు గ్రహించుటలో బాహువులు హస్తములతో నభినయించుచుండును. ఎగిరి నోటితోడనే పిందె లందుకొనవలెను. లయ తప్పకూడదు!

ఎవరికో కొందరికి గాని నోటికి పిందెలందుట లేదు. కొందరికి చిగురుటాకులే నోటి కందుచున్నవి. ఎక్కువమందికి ఆ ఎగిరిన తాకుకు రాలిన మావిపూల నలుసులు కన్నులలో పడుచున్నవి. వృద్ధుడగు జాయపకెంతో నేర్పు కలదు. బద్దెన కెంతయో నీతి తెలియును. మేచయకు తెలియనిదే లేదు. గోవిందశర్మ లోకజ్ఞుడు, మాచల్దేవి నాగరక వృత్తిపారీణ, ఐనను వా రందరకు ఆ మావి కన్నులలో పూలదుమ్ము చల్లుచున్నది. గాయము నయమైన పర్వతనాయకుడు కూడ వచ్చినాడు. కుంభకర్ణునివలె నెత్తైన యాతనిదేహ సహాయముతో, నాతడు ఎగురకుండగనే మాటిమాటికి మామిడికాయలు విలాసముగానోటితోనందుకొనుచున్నాడు!

మాచల్దేవి ఇంట నిట్టు సువసంతకోత్సవము ప్రారంభించినది. నృత్యములతో, నాట్యములతో, సంగీతములతో, కవిపండిత గోష్ఠులతో నా యుత్సవ మక్కడ సాగిపోవుచున్నది. ఇది చైత్ర పూర్ణిమవరకు సాగును.

ఒకనాడు అశోకోత్తంసిక యను నుత్సవము చేయుదురు. అది అష్టమినాడు జరుగును. అశోకపు చిగుళ్ళను ఆదినమునభక్షించి అశోకపుష్పములను రకరకములుగా శిరోభూషణము లొనర్చి యలంకరించుకొందురు. మరియొకనాడు చూతలతికయను నుత్సవము అదేవిధముగా మామిడిపూలతో,లతలతో నొనర్తురు.

నవమినాడు కదంబ యుద్ధములు చేసెదరు. నాగరకులు బారులుగా దీరి కదంబపుష్పములను గుత్తులుగా గట్టి విల్లంబులతోడను, వడిసెలలతోడను, హస్తములతోడను ఒకరిపై నొకరు వేసికొని యుద్ధము చేయుదురు.

ద్వాదశినాడు దమన భంజిక జరుగగలదు. శ్రేయోభివృద్ధికై యానాడు నాగరకు లొకరినొకరు దమనముతో పూజించుకొందురు.

మరి శుక్ల చతుర్దశినాడు మదనోత్సవమే జరుగును. ఆనాడు మన్మథపూజ చేసెదరు. హరనేత్రాగ్ని సందగ్ధుడైన కాముని సంజీవన కథ నానాడు గీతములతో, నృత్తములతో, ప్రదర్శనములతో స్మరింతురు.

పూర్ణిమనాడు వసంతోత్సవము. వసంతములు బుక్కాయలు చల్లుకొనుటతో వేశ్యవాటికలో పూర్తి కాగలదు. మన కంతవరకు ఈ యుత్సవముల తిలకించుచు నుండ తీరిక యున్నదా?

* * * *

చైత్ర శుద్ధ పంచమినాడు కేశవశ్రీ స్వయంభూ నికేతనములలో మహావైభవముగా బ్రాహ్మణులందరు వైదిక వైభవముతో సరస్వతీపూజ జరిపిరి. పూజాంతమున పరిషత్తు సమావేశమయ్యెను. ఆ పరిషత్తుకు తిక్కన సోమయాజి యాహూతుడై వచ్చెను. కేతనకూడ అప్పటికి ఏక శిలానగరము చేరికొన్నందున నక్కడ సిద్ధమయ్యెను.

ఆ పరిషత్సమక్షమున కరణ విద్య నభ్యసించిన యారువేల మంది బ్రాహ్మణులకును పట్టాలపై తన చేవ్రాలు చేసి తిక్కన సోమయాజులు స్వయముగా వారలకు బహూకరించెను. వారల నీనాడు మరల పరీక్ష చేయలేదు. విద్యాపరీక్ష పూర్వమే యైనది. ఈమధ్య శస్త్రపరీక్ష మహాయుద్ధమునందే ఐనది. ఆ పత్రములపై గురునాధుడును, కేతనయు గూడ చేవ్రాళ్లు చేసిరి. ఆ యారువేల మంది బ్రాహ్మణులును ఆపత్రములు తమ దేవతార్చన సంపుటములలో పదిలము చేసికొనిరి.

పరిషత్తు ప్రారంభమునుండి తిక్కచమూపతి యక్కడనే ఉండెను. మారన గాయము నయమై తిక్కన సోమయాజుల సమీపమున నుండెను. సభాంతమందు తిక్కచమూపతి మారనను నిర్దేశించి తన కుమారుని మరల తన కిమ్మని తిక్కన సోమయాజుల నర్థించెను.

ఏమిది? తిక్కన సోమయాజులకు విస్మయ మయ్యెను. వెనుక పదియేండ్లనాడు, విక్రమసింహపురంలో సమస్తాభరణములతో నిండ, చోరులు ఎత్తుకొనిపోయి ఆభరణము లపహరించి ప్రాణావశిష్టుడుగానుండ, నాతని యేకైకపుత్రుని పెన్నాతీరమున పారవైచిరి. తిక్కచమూపతి వెదకించియు లాభములేక నిరాశతో తన పట్టణమునకు మరలెను.

ఆ పిల్లవానిని చూచి రక్షించిన ధర్మాత్ము లాతని నేమి ప్రశ్నించినను పలుకలేదు. పది దినములకు మాటలువచ్చి 'మాతండ్రి తిక్కనామాత్యుడు' అని యాతడు చెప్పెను. వారంతట ఆ కుర్రవానిని తిక్కనామాత్యుని ఇంటికి చేర్చిరి. తిక్కనామాత్యునికి పుత్రులు లేనందున నా బ్రాహ్మణబాలకుని పుత్రనిర్విశేషముగా గ్రహించి 'ఉపనయనాదికము లొనర్చి విద్య నేర్పుచుండెను. ఆతని దక్షిణపార్శ్వమున సుదర్శనాకారముగల యొక పెద్ద పుట్టుమచ్చయు కలదు. ఈ మధ్య యుద్ధములో గాయపడిన మారనను వైద్యులు పరీక్షించుచుండగా తిక్కచమూపతి యది నిరీక్షించి యాతడు తన పుత్రుడని గుర్తించెను. పిమ్మట విచారించి మారన పూర్వకథ తెలిసికొని తన కుమారుడే యని నిర్ధారణచేసెను.

ఆకథ విని తిక్కనసోమయాజులు మారనవైపు తిలకించెను. మారన ఆ యిద్దరు తిక్కనలవైపున పర్యాయదృష్టులు పరపుచుండ వెఱ్ఱిరాలు అగ్రహారాగ్రణి కేతన వ్యవస్థ చేసెను.

“ఇతడు తిక్కనామాత్యపుత్రుడు, తిక్కనసోమయాజి శిష్యుడు!”

మారన తిక్కచమూపతికి నమస్కరించెను. తిక్కచమూపతి ఆనంద బాష్పములతో పది సంవత్సరముల నాడు పోగొట్టుకొనిన తన ఏకైకపుత్రుని మారనను, సోమయాజుల ప్రసాదముచే మరల లభించిన, కుమారుని లేవనెత్తి యానంద బాష్పములతో నభిషేకించి గద్గదకంఠముతో దీవించెను.

* * * *

గోన గన్నారెడ్డికి యోగి వేషధారి యగు యవనచారుని, నాగాచారిని, ఇతర చారులను, జైనవసదిలో నగరి పెద్దలను తుదముట్టింప యత్నించిన వ్యవహర్తలను, సార్థవాహులతో కలసిన చారులను, తిక్కన సోమయాజులను వీధిలో కొట్ట యత్నించిన దుండగులను విచారింప విశేషాధికారము లొసంగబడెను. వారలపై నభియోగములు అనేక పత్రములవలనను, సాక్షులవలనను ఋజువైనవి. వారందరను చత్వరములలో శూలారోప మొనర్చునట్లు శిక్షలు విధింపబడెను.

ఆ యధికరణ వ్యవహారములలో అన్నమంత్రీశ్వరుడు సంపూర్ణముగా నిర్దోషియను విషయమును నిశ్చయమైనది. అది గన్నారెడ్డి మహారాజులకు తెలియబరచెను.

# కాబినెట్ల కార్ఖానా

(-14వ పేజీ తరువాయి)

ఐక్యరాజ్యసమితి ప్రజాస్వామిక సంస్థేకదా? కాని డాలర్లను కురిపించి ఎక్కువ వోట్లను సంపాదించిన అమెరికా 'వీటో' అధికారానికి స్వస్తి చెప్పాలనీ, భద్రతామండలి అధికారాలను సర్వసభ్య సమావేశానికి కట్టిపెట్టాలనీ ప్రయత్నిస్తున్నది. వోట్లు కలవాళ్ళదే రాజ్యమైనప్పుడు, ఎదటి పక్షాలకు రక్షణ ఏమున్నది?"

"సరే, దానికి అంగీకరిస్తాను. కాని ప్రతికూలపక్షపు బాధ్యత మాటేమిటి?"

"అదే చెప్పబోతున్నాను. తాముకూడా అధికారంలోకివచ్చి ఇప్పుడు ప్రభుత్వాన్ని పెడుతున్న చిక్కులే తాముకూడా అనుభవించగలమన్న భయం ప్రతికూల పక్షానికి లేకపోతే వాళ్లు బాధ్యతగా ఎందుకు వుంటారు? మొదటినించీ చివరవరకూ తమకు అధికారం రాదన్న నమ్మకం వాళ్లకి కలిగితే కేవలం ప్రభుత్వాన్ని ఊదరపెట్టటమే ముఖ్యమైనపనిగా పెట్టుకుంటారు. అట్లా కాకుండా, మాబోటివాళ్ళ ధర్మమా అని అధికారం వస్తుందన్న ఆశ వుంటే 'ఒరులేయవి యొనరించిన తన మనంబున కప్రియంబగు...' అన్న పద్యంలో చెప్పినట్లు బుద్ధిగా ఉంటారు."

"ఈ విధంగా అడుగడుక్కీ తలలు మార్చటం వల్ల పరిపాలన దెబ్బ తింటుందేమో!"

"ఎప్పటికీ దెబ్బతినదు. మనది శాంతియుతమైన పార్లమెంటరీ వ్యవస్థ. ఒకసారి శాసనసభకు ఎన్నిక అయితే, టరం తీరేవరకూ కడుపులో చల్ల కదలకుండా కూర్చోవచ్చు. మళ్లీ దానిని మార్చాలన్న భయమే అక్కర్లేదు. ఇంక ఉన్నవాళ్లు 'గుడుగుడు కుంచం' ఆట ఆడుకోవచ్చు. గద్దె మీద ఎల్లయ్యావున్నా, పుల్లయ్యావున్నా, వ్యవహారానికి లోపం రాదు. పరిపాలనా వ్యవహారాలను నిర్వహించటానికి ఉద్యోగులుఉండనే ఉన్నారు.

కాబినెట్ల మార్పువల్ల పరిపాలనకు ఆటంకం కలక్కుండా ఉండటానికి ముఖ్యకారణం మరొకటి ఉన్నది. ప్రజాస్వామ్యంలో శాసనసభ్యులకు కావలసినది చతుర్విధ స్వాతంత్ర్యాలూ, వాటన్నిటికీ మించిన ధనార్జన స్వాతంత్ర్యమూ, వీటికి అడ్డంరానంతవరకూ వాళ్లు చేసే మార్పులు పరిపాలనకి అడ్డంరావు."

"ఒక ఉదాహరణయినా చూపిస్తే-"

"తప్పకుండా. ఫ్రాన్సును చూడండి. ఒక్క ఏడాది తిరిగివచ్చేలోపల డజను మంత్రివర్గాలు అక్కడ మారిపోయినై. సోషలిస్టులు, రాడికలిస్టులు, డీగాలిస్టులు, ఎడంచేతివాళ్లు, కుడిచేతివాళ్లు, మూడోచేతివాళ్లూ ఒక్కరేమిటి? అంతా వరస తిప్పేశారు. కాని ఈ మార్పులవల్ల ఇండోచైనాలో ఫ్రాన్స్ చేస్తున్న యుద్ధ ప్రయత్నాల్లో మార్పేమయినా వచ్చిందా?"

రాలేదని అంగీకరించక తప్పలేదు.

"ఒక్కమాట. మీ పరిశ్రమ ప్రభుత్వానికి డబ్బు సమకూర్చగలదనీ, ప్రమాదాలనుంచి రక్షించగలదనీ మీరు నిరూపించకలిగితే, మీ గొప్పతనాన్ని అంగీకరిస్తాను" అని అన్నాను.

"అది అంతకష్టమయిన విషయం కాదు. ప్రమాదాలన్నుంచి రక్షించే విషయాన్ని తీసుకోండి. ఎడతెగని జాగ్రత్త అనేది ప్రజాస్వామ్యానికి విలువ అని చెపుతారు. అంటే మన 'బ్రాండు' ప్రజాస్వామ్యానికి ఎవరు శత్రువులా అని ఎప్పుడూ కనిపెట్టి ఉండాలన్నమాట. ప్రభుత్వానికి శత్రువులెవరో, అధికారంలో ఉన్నవాళ్ళకంటే ఇవతల ఉన్నవాళ్ళకు ఎక్కువగా తెలిసే అవకాశం ఉన్నది. కాబట్టి ఇవతల ఉన్నవాళ్లకు అధికారం వస్తూఉంటే వాళ్లు ఒక్కొక్క శత్రువునే వరసగా ఏరిపారేస్తారు.

ఇంక రెండో విషయం. ప్రభుత్వానికి డబ్బు వచ్చేది పన్నుల మూలంగానే. అయితే ఒకే ప్రభుత్వం అనేక రకాల పన్నులను వేయటానికి భయపడవచ్చును. అంతేకాదు అనేక అవకాశాలు వాళ్లకు కనిపించకపోవచ్చును. కొత్త ప్రభుత్వాలు ఏర్పడుతుంటే పాతపన్నులను ఉంచటమే కాక కొత్త వాటిని తగిలిస్తూ ఉండొచ్చు."

"దీనికికూడా ఒక ఉదాహరణ ఇస్తారా?"

"ఇదివరకు 'పాతాళ ప్రదేశ్'లో ఒక ప్రభుత్వం సిగరెట్లమీద పన్ను వేసింది. అప్పుడు ప్రజలుబాదం ఆకుల్లో పొగాకు చూర వేసి కాల్చటం మొదలుపెట్టారు. కాని ప్రభుత్వం భయపడి ఊరుకున్నది. రెండునెలలు కాగానే కొత్త ప్రభుత్వం వచ్చింది. అది చేసిన మొదటిపని బాదం ఆకులమీదా, పొగాకు చూరమీదా పన్ను వేయటమే."

ఆ అఖండ వాదానికి నిలబడలేక పోయినాను.

"మీరు వ్యవహారం ఎట్లా నడిపిస్తారు?" అని ప్రశ్నించాను.

"ఆ గదిలో షెల్ఫులవరసనూ, ఇనప్పెట్టెనూ చూశారుకదా! ఆ షెల్ఫులలో మా ప్రాంత శాసనసభ్యుల జీవిత వివరాలు యావత్తూ ఉన్నవి. సభ్యులకుగల కోరికలూ, ఉన్న విద్వేషాలూ, తీరనికోర్కెలూ, ఆరని పగలూ, అన్నీ పూర్తిగా సేకరిస్తాము. ఇవన్నీ తెలిసిన తరవాత, పక్కనఉన్న ఇనప్పెట్టె తోడ్పాటుతో మేము చేయలేని పని ఏముంటుంది?"

"మీ పరిశ్రమకు మూలపురుషులు ఎవరండీ?"

"హిందూమతం మోస్తరుగా మాకు అనేక మహాపురుషుల సాంప్రదాయాలు ఉన్నవేకాని మూలపురుషుడంటూ ఎవరూ లేరు. మాకియవెల్లీ, చాణుక్యుడు, డిశ్రేలీ మొదలైనవాళ్ళు ఆ మహాపురుషుల్లో కొందరు."

"మీ పరిశ్రమ ఇప్పుడు ఎక్కడ జోరుగా సాగుతున్నది?"

"భారతదేశంలో మద్రాసు బాగా వుండేది. కాని ఇప్పుడది పశ్చిమబెంగాల్, తూర్పు పంజాబ్, మధ్య భారత్ మొదలైన చోట బాగా ఉన్నది. విదేశాల్లో మొదట చెప్పవలసింది ఫ్రాన్సు."

"మీ ధాటికి గురిఅయిన వాళ్లకథ లేమయినా వివరిస్తారా?"

"ఆత్మస్తుతి మాకిష్టంలేదు. కాని ఫ్రెంచి అధ్యక్షుడు ఓరియోల్, గ్రీక్ రాజు, సర్దార్ పటేల్, డా॥ పట్టాభి, ప్రకాశంగారు మొదలైనవాళ్లను ఎవరినడిగినా, మీకు మా తడాఖా తెలుస్తుంది."

"మీకున్న అనుభవాన్నిపట్టి ప్రజాస్వామ్యానికి ఆధారమేమిటో సెలవిస్తారా?"

"శాసనసభ్యుల్లో అతి ప్రధానమైన భేదాలేవీ ఉండకూడదు. ఏదో స్వల్పవిషయాల్లో మాత్రమే భిన్నంగా ఉండి, కుడి ఎడమగా సర్దుకునిపోయే వాళ్లయి ఉండాలి. ప్రధాన భేదాలే ఉంటే ప్రజాస్వామ్యానికీ, మాపరిశ్రమకూ బ్రేక్ పడక తప్పదు."

"అందుకని?"

"అందుకని, వచ్చే ఎన్నికల్లో, వోటు చేసే టప్పుడు జాగ్రత్తపడండి. పెద్ద పార్టీ అయిన కాంగ్రెస్‌తో ఆటే భేదాలులేని ఏ సోషలిస్టులోన్న ఎన్నుకోండి. అంతేకాని ఆర్. ఎస్. ఎస్. వాళ్లనూ, కమ్యూనిస్టులన్ని మాత్రం పొరబాటునైనా ఎన్నుకోవద్దు" అని అంటూ ఆయన రిస్టువాచివంక చూసుకున్నాడు.

ఆ సూచనగ్రహించి, ఆయనకు నాలుగు థాంక్స్ పడేసి, మెల్లిదిగా జారుకున్నాను.

---






బాలగేయం:

# పిల్లల రాజ్యం

శ్రీ నండూరి రామమోహనరావు

ఇది పసితనపు పూలతోట,
ఇది ఎడతెగని తేనెపాట,
చెదరిపోని తొలికలల కోట,
ఇది పసితనపు పసిడి బాట.

నక్షత్రాలు పొద్దున్నే రాలిపోయి
లక్ష పువ్వులై యీతోటలో పూస్తాయి.
ఈ విరజాజి పొదల వినిపిస్తుందెప్పుడు
దేవకన్యల కాలిగజ్జెల చప్పుడు.

జలజలపారే యిక్కడి సెలయేళ్ల నీళ్లు
చంద్రుడిలోని లేళ్లు తాగుతాయి రాత్రిళ్లు,
చెట్లనీడల బడులుపెట్టి పావురాలు
చెబుతాయి పిల్లలకు మంచి పాఠాలు.

మాటకిక్కడ నానార్థాలు లేవు;
పాటకిక్కడ అపశ్రుతులు రావు;
ఈ తోటలోవుందొక రత్నాల గుట్ట;
ఇక్కడే వుంది పిట్ట కథల పుట్ట.

చరిత్రలోకి రాని రాజుల రాజ్యాలు,
శాస్త్రజ్ఞు లొప్పుకోని గొప్పసత్యాలు,
ఈ తోటలో కాలు పెడితే చాలు,
మీతోటి చెబుతాయి రహస్యాలు.

కాని మీచుట్టూ వుంది పుస్తకాలగోడ,
కనిపించదందుకే మీకీ బంగారుమేడ.
మేడలో ఉయ్యాలలూగే రాకుమారి
మీరు చూస్తే పోతుంది చిలకగామారి.






పడకగదీ, భోజనాలగదీ, చదుకునేగదీ అయిన వెనక గదిలో కూర్చుని ఊలు అల్లుతూ జోగుతున్న పోలీపెద్దమ్మ ఎదుట టామ్ హాజరైనాడు. ఆవిడ ఒళ్లో పడుకుని నిద్రపోతున్న పిల్లి తప్ప ఆవిడకు వేరే తోడెవరూలేరు. ఆవిడ కళ్ల జోడు తలమీదికి ఎగదోయబడి ఉన్నది. ఎప్పుడో పరారీ అయి ఉంటాడనుకున్న టామ్ తనఎదట హాజరయే సరికి ఆమె ఆశ్చర్యపడ్డది.

"నేనిక, వెళ్లి ఆడుకోవచ్చా. పెద్దమ్మా?" అనిఅడిగాడుటామ్.

"అప్పుడేనా? పని ఎంతవరకయింది.

"అంతా అయిపోయింది. పెద్దమ్మా.

"అబద్ధాలాడకు, టామ్ - నాకు చిరాకేస్తుంది."

'అబద్ధాలుకాదు. అంతా అయిపోయింది.

పెద్దమ్మకు ఇటువంటి సాక్ష్యంలో నమ్మకంలేక స్వయంగాచూడటానికి బయలు దేరింది, టామ్ చెప్పిన దాన్లో అయిదోవంతు నిజం ఉన్నా ఆవిడ సంతోషించటానికి సిద్ధంగానే ఉండింది. అటువంటప్పుడు చెక్కల గోడ యావత్తూ తెల్లగా రంగు వేసి ఉండటమే కాక ఒకటికి రెండు విడతలు రంగు వేసి ఉండటం చూసి ఆవిడకు నోట మాట రానంతపని అయింది.

"నాయిల్లు బంగారంగానూ! చూశావా,తలుచుకుంటే నువ్వుపని చెయ్యగలవు. కాని తలుచుకోటమే ఉండదు. పో, వెళ్లి ఆడుకో. కాని అదేపోత పొయ్యేవు. వీపుచిట్లగొడతా." అన్నది పెద్దమ్మ.

వాడు చేసిన పనికి ఆవిడ, పాపం ఎంతో సంతోషించి వాడికి మంచి ఆపిల్ పండు ఏరిఇస్తూ, బుద్ధిమంతులుగాఉండి చెప్పినమాట వినేపిల్లలు ఎట్లా బాగుపడతారో చిన్న ఉపన్యాసం ఇచ్చింది. ఈ సందడిలో టామ్ ఆవిడకు తెలీకుండా ఒక్కప్పచ్చి చేతివాటు వేశాడు.

టామ్ బయటికి వస్తూ మేడమీదికి వెళ్ళేమెట్లెక్కుతున్న సిడ్‌ను చూశాడు. కావలిసినన్ని మట్టిబెడ్డలు అందుబాటులో ఉన్నాయి సిడ్‌మీదవిసరటానికి. టామ్‌కు క్షణంకూడా పట్టలేదు. బిత్తరపోయిన పెద్దమ్మ కదిలి వచ్చి సిడ్‌ను రక్షించేలోపుగా సిడ్‌కు ఆరేడు బెడ్డలు గురిగా తగిలాయి. టామ్ గోడదూకి పారిపోయినాడు. చక్కగోడకు వాకిలి లేకపోలేదు. కాని టామ్‌కు సామాన్యంగా దీన్ని ఉపయోగించే వ్యవధి ఉండేదికాదు. చొక్కాకు కుట్టి ఉన్న దారం నల్ల దారమని బయట పెట్టినందుకు సిడ్‌కు తగినశాస్తి అయింది. ఇప్పుడు టామ్‌కు మనస్సు శాంతించింది.

టామ్ ఇంటిపక్క సందులోనుంచి పెద్దమ్మ ఆవులుండే పాకపక్కగా గ్రామంమధ్యకు వెళ్లాడు. అక్కడ రెండు పిల్లలసేనలు యుద్ధానికి గానుచేరి ఉన్నాయి. అందులో ఒక సేనకు సేనానాయకుడు టాం రెండోసేనకు నాయకుడైన జోహార్పర్ టామ్‌కు ప్రాణస్నేహితుడు. సేనానాయకులిద్దరూ యుద్ధంలో పాల్గొన్నారు. వారుఎత్తున దిబ్బమీద కూర్చుని తమ అంగరక్షకుల ద్వారా సైనికులకు ఆజ్ఞలిచ్చి యుద్ధం చేయిస్తారు. యుద్ధంచాలాసేపు తీవ్రంగా జరిగి చివరకు టామ్

బలాలు గెలిచాయి. యుద్ధంలో చచ్చిపోయిన వారు లెక్కించబడ్డారు. యుద్ధఖైదీలు వాపసు చేయబడ్డారు. మరొకయుద్ధానికి షరతులు కూడా ఆమోదించబడ్డాయి. తరవాత రెండు సేనలూ రెండుపంక్తులుగా నిలబడి "మార్చ్" చేసుకుంటూ వెళ్ళిపోయాయి. టామ్ ఒంటిగా ఇంటిముఖం పట్టాడు.

జెఫ్ థాచర్ ఇంటిమీదుగా వస్తుండగా వాళ్ళ దొడ్లో టామ్‌కు ఒక కొత్త అమ్మాయి కనిపించింది. నీలమైనకళ్లు పెట్టుకుని అందంగా ఉంది. బంగారురంగుజుట్టు రెండు జడలు వేసుకుంది. తెల్లటి ఫ్రాక్ వేసుకుని, కుట్టుపని చేసిన కుచ్చీలాగు తొడుక్కుంది. ఈమెను చూస్తూనే యోధుడు నిలువునా కూలినట్టయినాడు. ఆమీలా లారెన్స్ అనే ఒకానొకపిల్ల టామ్ హృదయంలోనుంచి ఒక్కసారిగా మాయమైపోయింది.

టామ్ ఈ కొత్తపిల్లను ఆరాధించసాగాడు. ఆమె తనను చూసేదాకా చాటుగా ఆమెను తాను చూడసాగాడు. ఆతర్వాత ఆమెను చూడనట్టు నటిస్తూ, ఆమెను ఆకర్షించటానికని రకరకాల పిల్లకోరాన్కసి వేషాలు వేయసాగాడు. ఏదో మొగ్గ వేస్తూ టామ్ చూసేసరికి ఆ పిల్ల దొడ్లోనుంచి ఇంట్లోకి వెళ్లిపోవటం కంటబడింది. టామ్ విచారంతో కంచె దగ్గిరికి వచ్చినిలబడి, ఆ పిల్ల కొంచెంసేపు నిలబడుతుందని ఆశించాడు. ఆమె మెట్లమీద ఒకక్షణం ఆగి గడపలోపలికి అడుగుపెట్టటం చూసి ఒక్క నిట్టూర్పు విడిచాడు. కాని మరుక్షణమే వాడి మొహం వికసించింది. ఎందుకంటే లోపలికి పోతూ ఆపిల్ల బంతిపువ్వొకటి కంచెమీదుగా విసిరి వేసింది.

టామ్ గబగబా పరిగెత్తుకుంటూ వచ్చి నేలమీద పడిఉన్న పువ్వుకు ఒకటి, రెండడుగుల దూరాన ఆగి కళ్లకు చెయ్యిపెట్టి దూరాన ఏదో వింత జరుగుతున్నట్టుగా వీధివెంట చూశాడు. తరవాత గడ్డి పరక ఒకటి ఏరి, తలపైకెత్తి ముక్కుమీద గడ్డి పరకను నిలబెట్టటానికి యత్నించాడు. అది పడిపోకుండా అటూ ఇటూ కదులుతూ మెల్లిగా పువ్వు దగ్గిరికి జరిగాడు. ఉపాయంగా పువ్వుతొడిమ కాలివేళ్ల మధ్యపట్టుకుని వీధిమలుపుదాకా కుంటు కుంటూ పోయి, పువ్వు తీసుకుని జేబులో వేసుకుని మళ్లీ కంచెదగ్గిరికి తిరిగివచ్చి పొద్దూకే దాకా అక్కడే తారట్లాడుతూ, వెనకటిలాగే పిల్లిమొగ్గలు వేయసాగాడు. అయినా ఆ పిల్ల మళ్లీ కనిపించలేదు. ఆ పిల్ల ఏకిటికీలోనుంచిగాని తనను చూసిఉంటుందని టామ్ ఆశించాడు. చివరకు వాడు ఇంటికి వెళ్లాడు.

రాత్రి అన్నం తింటున్నంతసేపూ వాడి ఉత్సాహం చూసి పెద్దమ్మ, "ఏడికేం వచ్చింది!" అని ఆశ్చర్యపడింది. సిడ్‌మీద దెబ్బలు వేసినందుకు బాగా చివాట్లు తినికూడా టామ్ చలించలేదు. మీదుమిక్కిలి పెద్దమ్మ ఎదురుగానే పంచదార కాజెయ్యటానికి ప్రయత్నించి ముణుకులు విరగగొట్టించుకున్నాడు.

"సిడ్ పంచదార తీసుకుంటే కొట్టవే?" అన్నాడు టామ్, పెద్దమ్మతో.

"అవును, సిడ్ నీ లాగా కొరుక్కుతినడు. నే చూడనప్పుడల్లా నీ చెయ్యి పంచదార మీదికే పోతుంది," అన్నది పెద్దమ్మ.

కొద్ది సేపటికి పెద్దమ్మ వంటింట్లోకి వెళ్లింది. సిడ్ ఎవరూ ఏమీ అంటారన్న భయం లేకుండా పంచదార పోసిన పింగాణీ దొన్నె అందుకున్నాడు. కాని అది వాడి వేళ్లనుంచి జారి కిందపడి పగిలిపోయింది. టామ్‌కు పరమానందమయింది. కాని వాడు కిక్కురుమనలేదు. పెద్దమ్మవచ్చి, "ఈ పని ఎవరు చేశారు?" అని అడిగేదాకా టామ్ నోరు మెదప దలచలేదు. ఆ తరవాత ఈ "పత్తిత్తు" గాడి భరతం పట్టించి ఆనందింతామనుకున్నాడు.

పెద్దమ్మ తిరిగివచ్చింది. పగిలిన పంచదార దొన్నె చూసి కళ్లజోడు మీదుగా నిప్పురవ్వలు కురిపించింది "ఇంకొక్క క్షణంలో అబ్బాయిగారిపని!" అని టామ్ అనుకుంటున్నాడు. మరుక్షణం వాడు నేలమీదపడి ఉన్నాడు. పెద్దమ్మ రెండో దెబ్బవెయ్యటానికి చెయ్యి ఎత్తింది. "నన్నెందు కొట్టతావ్? సిడ్ పగలగొట్టాడు," అని టామ్ అరిచాడు.

పోలీ పెద్దమ్మ నిశ్చేష్టురాలయింది. ఆవిడనుంచి ఇక దయారసం ఒలుకుతుందని టామ్ అనుకున్నాడు. కాని ఆవిడ, "దెబ్బతింటే ఏంలే? నే చూడకుండా ఎన్ని వెధవపనులు చేశావో!" అన్నది.

అయినా ఆవిడ అంతరాత్మ బాధపడింది. జాలిగా ఏమన్నా అందామనుకున్నది గాని బెట్టుచెడి

పోయి, టామ్‌కు అలుసవుతుందని సంకోచించింది. అందుచేత ఆవిడ పైకేమీ అనకుండా తనపనులు చూసుకోసాగింది.

పెద్దమ్మ మెత్తబడ్డ సంగతి టామ్ గ్రహించాడు. కాని తాను మెత్తబడదలుచుకోలేదు. ఆవిడ కుమిలి పోవాలిసిందే. తానుజబ్బు చేసి చచ్చిపోతున్నట్టు ఊహించుకున్నాడు. మంచిగా ఒక్కమాట అనమని ఆవిడ బతిమాలుతుంది. తాను గోడకు తిరిగి అట్లాగే చచ్చిపోతాడుగాని, తననోట ఆ మాట మట్టుకురాదు. అప్పుడెట్లా ఉంటుంది ఆవిడకి? తానునదిలో పడిచచ్చిపోయినట్టూ, తన శవాన్ని తడి తడిగా ఇంటికి తెచ్చినట్టూ టామ్ ఊహించుకున్నాడు. ఆవిడ తన మీద పడి వలవలా,కన్నీరు వరదలయేటట్టు ఏడుస్తుంది. తన పిల్లవాణ్ణి తనకిమ్మనీ, ఇక ఎన్నడూ వాణ్ణి కోప్పడననీ దేవుడికి దణ్ణాలుపెడుతుంది. కాని తను కటికశవం—ఇక ఎన్నటికీ కాళ్లూ చేతులు ఆడించలేడు. తన కష్టాలన్నీ గట్టెక్కి ఉంటాయి.

ఈ విధంగా ఆలోచించుకుపోతున్నకొద్దీ టామ్‌కు దుఃఖం తెరలు తెరలుగా పొర్లి వచ్చి ఉక్కిరిబిక్కిరి అయినాడు. వాడి కంటివెంటకన్నీరు ఉబికి వచ్చి ముక్కుమీదికి కారసాగింది. తనకష్టాలను తలుచుకొనడంవల్ల కలిగే ఈ దుఃఖంతో కలిగిన ఆనందాన్ని ఇతర ప్రాపంచిక సుఖాలతో పాడు చేసుకొనదలచలేదు. అందుచేత వారంరోజుల క్రితం చుట్టాలింటికివెళ్లి తిరిగివచ్చిన మేరీ గెంతుతూ, పాడుతూ తన గదికి వచ్చేసమయానికి టామ్ మరో వాకిలిగుండా తన దుఃఖాన్ని శాలువలాగా కప్పుకుని బయటికి వెళ్లి పోయినాడు.

టామ్ బయటికి వెళ్లాడు. కొత్త చోట్లా, పిల్లలు రాని చోట్లా తిరిగాడు. నదిలో ఒకకొయ్య తెప్పకనిపించింది. దానిమీద ఎక్కికూర్చున్నాడు. బాధ లేకుండా నీళ్లలో పడి చావగలిగితే బాగుండుననుకున్నాడు. దాచుకున్న బంతిపువ్వు జ్ఞాపకం వచ్చింది. అది పైకితీశాడు. నలిగి వాడిపోయి ఉంది. పేరు తెలియని ఆ అమ్మాయి కనీసం తనను చూసి జాలిపడుతుందా అనుకున్నాడు. చివరకు తెప్పను వదిలి చీకట్లో బయలుదేరాడు.

రాత్రితొమ్మిదిన్నర, పదిప్రాంతాల "ఆ అమ్మాయి" ఉండేగొందిలోకి వచ్చాడు టామ్. ఎక్కడా మనుష్య సంచారంలేదు. మిద్దె మీద ఒకగదిలో దీపం వెలుగుతున్నది. ఆ అమ్మాయి అక్కడ ఉంటుందా అనుకున్నాడు. వాడు కంచెమీదినుంచి లోపలికిదిగి పాదులమధ్యగా ఆ గది కిందికి వెళ్లిచాలాసేపు పైకిచూశాడు. తరవాత అక్కడే నేల మీద వెల్లకిలా పడుకుని, నలిగిన పువ్వుచేత్తోపట్టుకుని, చేతులురొమ్ముమీద పెట్టుకున్నాడు. ఇల్లూ, నీడా, దిక్కూ, మొక్కూ లేకుండా తను ఇట్లాగే చచ్చిపోతే రేపు ఉదయం తెల్లారిన తరవాత ఆ అమ్మాయి కిటికీ తలుపు తెరిచి ఆనందంతో బయటికి చూసినప్పుడు తాను కనిపిస్తాడు. తన కోసం ఆపిల్ల ఒక్క కన్నీటిచుక్క రాల్చదా?

ఇంతలో కిటికీ తెరుచుకుంది పని మనిషి మొరటు తిట్లు వినిపించాయి. చావసిద్ధంగా ఉన్న అభాగ్యుడిమీద కుండెడు నీరు పడింది వాడు లేచాడు. తనమీద ఎవరో ఏదో విసిరిన చప్పుడయింది. తరవాత ఏదో గాజువస్తువు పెళపెళా పగిలి నట్టయింది. టామ్ కంచెదూకి దారితీశాడు.

మరి కొంతసేపటికి టామ్ తన తడిసిన దుస్తులు విప్పేసి పడుకోవటానికి సిద్ధపడుతూండగా సిడ్ నిద్ర లేచాడు. వాడేదో అందామనుకున్నాడు. గాని టామ్ కంటికి వెరిచి ఊరుకున్నాడు. టామ్ ఆ పూట దేవుడి ప్రార్థన చెయ్యకుండా పడుకున్న సంగతి మాత్రం సిడ్ కడుపులో పెట్టుకున్నాడు.

## 4

మర్నాడు ఆదివారం. ఉదయం భోజనాలు పూర్తి కాగానే పోలీ పెద్దమ్మ అందరినీ చేర్చి ప్రార్థనలు చేసింది. టామ్ వళ్ల బిగువున బైబిల్‌లో అయిదు గీతలు వప్పగించటానికి పూనుకున్నాడు. సిడ్ తన వంతు ఎప్పుడో వప్పగించేశాడు.

టామ్ అరగంట సేపుపఠించినా కొంచెంకూడా తలకెక్కలేదు. వాడి ఆలోచనలు ఎటో వెళ్లాయి. వాడి చేతులుకూడా ఒక్కక్షణం పాటు ఊరికే ఉండలేదు.

మేరీ వచ్చి టామ్ వల్లించిన గీతలు వప్పగించుకోవటానికి ప్రయత్నించింది. కాని ఎన్నిసార్లు అందించినా వాడికవి రాలేదు.

"ఒరే, పిచ్చివాడా! నీ కేమీ

రాలేదు. మళ్లీ చదువు. వల్లించావంటే భలేవస్తు విస్తాను. చదువు. మంచివాడివి కాదూ?" అన్నది మేరీ.

"అట్లాగే, మేరీ. ఏమిస్తావు?"

"ఇప్పుడు చెప్పను. ఎంతో మంచివస్తువు."

ఈ సారి టామ్‌కు అయిదు గీతలూ క్షణంలో వచ్చేశాయి. మేరీ వాడికి కొత్త చాకు ఇచ్చింది. దానిమీద "బార్లో"అనేపేరు చూసి టామ్ పరవశుడైనాడు. ఆ చాకు ఏదికొయ్యటానికీ పనికి రాదు. అయితే నేం? అది "బార్లో" చాకు. దాంతో టామ్ అలమారు ఉతకత్తాడు. బీరువామీదకూడా దాన్ని ప్రయోగిస్తూండగా ఆదివారం బడికి పోవాలని పిలుపు వచ్చింది.

మేరీ నీళ్లూ, సబ్బూ ఇచ్చింది. టామ్ వాటిని తీసుకుని బయటికి వెళ్లాడు. నీటిని ఒక బెంచిమీద పెట్టి, సబ్బు నీటిలో ముంచి పక్కనే పెట్టాడు. చొక్కా చేతులు పైకిమడిచి మెల్లిగా నీరు పారబోసి లోపలికి వచ్చి తలుపు చాటున తువాలుతో శ్రద్ధగా మొహం తుడుచుకోసాగాడు.

మేరి వాడి చేతిలోనుంచి తువాలు లాగేసి,

"సిగ్గులేదురా, టామ్? నీళ్లుతగిలితే మొహం పొక్కుతుందా?" అని అడిగింది.

మళ్లీ నీరు ప్రత్యక్ష మయింది. టామ్‌కొంత సేపు సంకోచంగా నిలబడి, గట్టిగా గాలి పీల్చి ఉపక్రమించాడు. కొంత సేపటికి వాడు కళ్లు రెండూ మూసుకుని, తువాలు కోసం తడుపుకుంటూ లోపలికి వచ్చాడు. ఈసారి వాడి మొహం నిండా సబ్బు బుడగలు సాక్ష్యం ఉన్నాయి. కాని మొహం తుడుచుకున్నాక చూస్తే గడ్డం వరకూ, దవడ వరకూ మాత్రమే శుభ్రమయింది. మెడమీద మట్టి నల్లగా ఉండనే ఉన్నది. ఈసారి మేరీ స్వయంగా చెయ్యిచేసుకుంది. ఆమె వాడి అంతు కనుక్కున్న అనంతరం తడి జుట్టు చక్కగా దువ్వింది. మంచిదుస్తులు -ఆదివారం నాడుమాత్రమే వేసుకునేవి -తొడిగింది. ఇప్పుడు వాడు చూడటానికి బాగున్నాడు కాని సుఖంగాలేడు. వాడికి ఇన్ని దుస్తులు గాని, ఇంత శుచిత్వంగాని సరిపడవు. మేరీ టామ్ కాలిజోళ్లు కూడా మరిచిపోలేదు.

చెద్ది సేపట్లో మేరీ, ముగ్గురు పిల్లలూ ఆదివారం బడికి బయల్దేరారు. ఈ బడి అంటే టామ్‌కు మంట. కాని సిడ్‌కూ, మేరీకి చాలా ఇష్టం.

తొమ్మిదినుంచి పదిన్నరదాకా బడి. తరవాత చర్చి. చర్చివాకిలి దగ్గిర టామ్ వెనకపడి ఒక కుర్రాణ్ణి పలకరించి, "బిల్లీ, నీదగ్గిర పచ్చ టిక్కెట్టుందా?" అని అడిగాడు.

తనదగ్గిర ఉన్న వస్తువొకటి బిల్లీకి అంటగట్టి టామ్ వాడి దగ్గిర ఉన్న పచ్చటిక్కెట్టు తీసుకున్నాడు. మరొకడికి బిళ్ళేరుగోలీలిచ్చి మూడు ఎర్రటిక్కెట్లు తీసుకున్నాడు. ఇంకొకడి దగ్గిర రెండు నీలం టిక్కెట్లు తీసుకున్నాడు. పది, పదిహేను నిమిషాల పాటు టామ్ ఈ విధంగా రంగురంగుల టిక్కెట్లు పోగుచేసి, ఇతర పిల్లలతో బాటు చర్చిలోకి ప్రవేశించాడు. వాడు తన స్థానంలో చేరి దొరికిన మొదటి పిల్లవాడితో పోట్లాట పెట్టుకున్నాడు. పంతులు వచ్చి తగువు నిలిపాడు. ఆయన అటుతిరగ్గానే ఇంకో పిల్లవాడి జుట్టులాగి, వాడు తిరిగి చూసే లోపల టామ్ దీక్షగా పుస్తకం చదవ సాగాడు. తరవాత ఇంకో కుర్రాణ్ణి పిన్నుతో పొడిచాడు. పంతులువచ్చి చివాట్లు పెట్టాడు.

ఈ పిల్లలలో ఒకడికీ నిజంగా పాఠం రాదు. ఏదో విధంగా నట్టుతో గీతాలువప్పగించి రంగు టిక్కెట్లు పుచ్చుకునేవాళ్లు. రెండు గీతాలు వప్పగించిన వారికి ఒక నీలం టిక్కెట్టు. ఒక ఎర్ర టిక్కెట్టు పదినీలం టిక్కెట్లకు సమానం. ఒక పచ్చ టిక్కెట్టు, పది ఎర్ర టిక్కెట్లకు సమానం. పది పచ్చటిక్కెట్లు సంపాదించిన పిల్లలకు సూపర్నెంటు సాదాబైండు చేసిన బైబిలు ఇచ్చేవాడు. పాత విద్యార్థులు మాత్రమే ఈ రంగు టిక్కెట్లను భద్రంగా దాచుకుని కొన్ని ఏళ్లతరవాత బైబిల్ సంపాదించుకునే వాళ్లు. ఎవరన్నా బైబిల్ తీసుకున్న రోజువింతగా ఉండేది.

కొంత సేపైన తరవాత సూపర్నెంటు లేచి నిలబడ్డాడు. ఈయన పేరు వాల్టర్స్. వయసు 35 ఏళ్లు. ఆయనకు ఆదివారమంటే ఎంతో భక్తి. ఆ రోజున ఆయన గొంతే మరోలా ఉండేది. ఆయన ఈ విధంగా మాట్లాడ సాగాడు.

"చూడండి, పిల్లలూ, మీరంతా ఒక్కక్షణం నిశ్శబ్దంగా కూర్చుని నే చెప్పేది వినండి. అదీ! మంచి

అబ్బాయిలూ, అమ్మాయిలూ అలా ఉండాలి. ఒక పిల్ల కిటికీ లోంచి చూస్తూంది. నేను బయట ఎక్కడో, ఏ చెట్టు కొమ్మ మీదో ఉండి, ఏ పిట్టలతోనో మాట్లాడుతున్నాననుకుంటోంది. కానీ సు (పిల్లల నవ్వు) మీరంతా శుచిగా, మంచిగా, స్వచ్ఛత గలిగి ఉండటం నాకెంతో ముచ్చటగా ఉంటుంది.." ఈ ధోరణిలో ఆయన మాట్లాడుతూ పోయాడు. ఆయన ఉపన్యాసం కొంతసేపు కొనసాగినంతలో మళ్లీ యుద్ధం ఆరంభమయింది. గుసగుసలు ఎక్కువైనాయి. శ్రద్ధగా భక్తితో వినేవాళ్ళ ఏకాగ్రత కూడా చెదిరింది. ఉన్నట్టుండి అకస్మాత్తుగా సద్దు నిలిచిపోయింది. వాల్టర్ ఉపన్యాసం నిలిచిపోవడంతో మౌనంగా పిల్లలందరూ కృతజ్ఞతా సూచకంగా చిరునవ్వులు వెదజల్లారు.

అసలు గుసగుసలు ఆరంభించడానికి కారణం కొత్తవాళ్ల రాక. ఒక వృద్ధుడు, ఒక మధ్యవయస్కుడు, థాచర్, అతని భార్యా వచ్చారు. అతని భార్య ఠీవిగా నడుస్తుంది. ఆమెకూడా ఒక అమ్మాయివుంది. టామ్ హడావిడిగా అటూ ఇటూ చూస్తున్నాడు. అతని హృదయంలో ఆవేగం హెచ్చింది. ఆమె లారెన్స్ ప్రేమ ఉట్టిపడేలాగు అతని వంక చూస్తోంది. కాని టామ్ ఆమె కళ్లల్లోకి చూడలేక పోతున్నాడు. అతనిదృష్టి ఒకసారి ఆమెవంకా, మరోకసారి ఆ కొత్త అమ్మాయివంకా, పరుగులు పెడుతోంది. ఆ కొత్త అమ్మాయిని చూస్తుంటే అతని ఒళ్లు పరవశమై పోతోంది. హుషా రెక్కువయింది. నలుగురూ చూడాలన్నట్టు మరింత అల్లరి చెయ్యడం ఆరంభించాడు టామ్. పక్కనున్న వాళ్ళను పొడవడం గెంటడం, జుట్టు పీకడం మొదలెట్టాడు. తనకి చేతనైన కొంటి పనులన్నీ చూపిస్తున్నాడు. ఆపిల్లకి తన ప్రజ్ఞ పూర్తిగా బోధపడింది. అయితే ఈ హుషారులో రాత్రి మీద పడిన చన్నీళ్లు కూడా అప్పుడప్పుడు జ్ఞాపకం వస్తూనే ఉన్నాయి.

వాల్టర్ ఉపన్యాసం ముగించగానే కొత్తవాళ్లని అందరికీ పరిచయం చేశాడు. మధ్యవయస్కుడు చాలా గొప్పవాడు—జడ్జి. అతని వూరు ఇక్కడికి చాలా దూరం కూడా. దేశంచాలా చూశాడన్న మాట. ఆయన తమ్ముడు థాచర్. అప్పుడక్కడ చేరిన వాళ్ళందరూ ఎవళ్ళ గొప్ప వాళ్లు చూపించుకుంటున్నారు. వాల్టర్ అందరికీ ఆజ్ఞలిస్తున్నాడు. లేడీటీచర్లు మాటిమాటికీ జుట్టు సవరించుకుంటున్నారు. మాటిమాటికీ రుమాళ్లు తీసి ముఖాలు అద్దుకుంటున్నారు. అల్లరి చేస్తున్న పిల్లలకేసి ఒకసారి కోపంతో చూసి, అంతలోనే ముఖమంత విస్తరించిన నవ్వు తెచ్చుకుంటున్నారు. మొగపిల్లలు మహా గర్వంతో ఎగిరి పడుతున్నారు. ఆడపిల్లలికి మరింత నాజూకు ఎక్కువయింది. ఇదంతా చూస్తూ తన్ని గౌరవిస్తున్నారని జడ్జిగారి మూతి నవ్వుతో బిగుసుకు పోయింది.

ఇవ్వాళ ఎలాగైనా సరే తన స్కూల్లో అద్భుతంకల పిల్లలున్నట్లు చూపించుకోవాలని వాల్టర్ తాపత్రయ పడుతున్నాడు. ఒకణ్ణి ఎంచి వాడికి బైబిల్ బహుమతీ ఇవ్వాలనుకున్నాడు పిల్లలదగ్గిర కెళ్లి. వాళ్ల దగ్గిరటిక్కట్లు లెక్కపెట్టటం మొదలెట్టాడు. కాని బైబిల్ బహుమతి ఇవ్వడానికి కావలసినన్ని టిక్కట్లు ఎవ్వరిదగ్గిరా కనబడలేదు. పాపం చూస్తున్న కొద్దీ వాల్టర్ మొహం మాడిపోతోంది.

పాపం చాలావరకు ఆశ చచ్చిపోయింది. ఇంతలో టామ్ సాయర్ ముందుకొచ్చాడు ఠీవిగా. వాడి వద్ద తొమ్మిది పసుపుపచ్చ టిక్కట్లు, తొమ్మిది ఎర్రటిక్కట్లు, తొమ్మిది నీలిరంగు టిక్కట్లు ఉన్నాయి. అవి చూపించి బైబిల్ ఇవ్వమని దర్జాగా అడిగాడు. వాల్టర్ కి నెత్తిమీద పిడుగు పడినట్టయింది. 5 ఏళ్లనించి టామ్ సంగతి ఆయనకి తెలుసును. టామ్ కి ఈసమర్థత ఉండదని ఆయన నమ్మకం. కాని ఎల్లా? టామ్ దగ్గర అన్నిటిక్కట్లు ఉన్నాయి, సరే ఇంక తప్పేదికాదు. టామ్ జడ్జి, థాచర్ కూచున్న పీఠం

(31-వ పేజీ చూడండి)



# బండ ముక్కు బాలయ్య



శ్రావణి కుప్పనూర్పుడు రోజులు. మా కామయ్య పొద్దస్తమానమూ కుప్పలు నూర్పిస్తూ పొలాల్లోనేవుంటున్నాడు. మాయింటికి ఎప్పుడో ఓసారివచ్చి మానాన్నగారితో కాస్సేపు మాట్లాడి మళ్ళీ పొలానికి వెళ్ళిపోయేవాడు. రాత్రిళ్లు కళ్ళంలోనే పడుకొనేవాడు. మేము అయిదారు రోజులయ్యేటప్పటికి పిచ్చెక్కినట్టయ్యాము. రోజూ రాత్రి కథలువినటం బాగా అలవాటైపోయింది మాకు. కథ వినందే నిద్రపట్టేదేకాదు.

ఒకరోజున మేము మానాన్నగారిని తెగించి అడిగేశాము. మేము కూడా కామయ్యతోపాటు పొలానికి వెడతామని. మానాన్నగారు కోప్పడ్డారు. కాని, కామయ్య, మాబిక్కమొహాలు చూసి "పోనీ, పంపించండి దొరగారూ! పిల్లలకి కథలు చెబుతూంటే నాకూ కాలక్షేపమవుతుంది. తెల్లారాక ఇంటికి తీసుకొచ్చి దిగబెడతా" నన్నాడు. మానాన్నగారు చివరికి ఒప్పుకున్నారు. నేనూ, చెల్లాయి ఎగిరి గంతేసి, గబగబా అన్నంతిని, కామయ్యతో బండెక్కి పొలానికి వెళ్లాం.

వెన్నెల హాయిగా కాస్తోంది, మేమిద్దరమూ గడ్డిమీద బొంత వేసుకుని పడుకున్నాం. కామయ్య కొంచెందూరంలో చుట్టకాలుస్తూ పడుకున్నాడు. ఇంకాదూరంగా ఎడ్లు గడ్డిమేస్తూంటే మెళ్లో గంటలు గణగణ మోగుతున్నాయి.

"ఇవ్వాళ మంచికథ చెప్పాలి కామయ్యా!" అన్నాను నేను.

బంధుశ్రీ

కామయ్య చాలా పెద్దకథ చెప్పాడు తరవాత చెల్లాయి "ఇంకో కథ చెప్పాలి. లేకపోతే మేము నిద్రపోము." అంది, కామయ్య "బండ ముక్కు బాలయ్య కథచెప్పనా?" అన్నాడు. "చెప్పు, చెప్పు" అన్నానునేను.

"అనగా అనగా ఒకవూళ్లో బాలయ్య అని ఒక పాతికేళ్ళ అబ్బాయి ఉన్నాడు. అతని యింటి పక్కనే కామాక్షిఅనే అమ్మాయి ఉండేది. కామాక్షిఅంత అందమైన పిల్ల ఆవూళ్లోనేకాదు, ఆజిల్లాలోనే లేదని అంతా చెప్పకుంటూ ఉండేవారు.

కామాక్షిని ఎలాగైనా పెళ్లి చేసుకోవాలని బాలయ్య పట్టుదల. బాలయ్య అందమయినవాడే. కాని అతని ముక్కుబాగా పెద్దది. వెడల్పుగా, పొడుగ్గా పొడుం కాయలాగా వుండేది. అందరూ అతన్ని "బండముక్కు బాలయ్యా!" అని ఏడిపించేవారు.

బాలయ్య తన్ను పెళ్లిచేసుకోమని అడిగినప్పుడల్లా కామాక్షి వెక్కిరిస్తూఉండేది. ఆ అమ్మాయి మహాకొంటెపిల్ల.

కామాక్షీ! నన్ను పెళ్లిచేసకోవూ?" అనిబాలయ్య.

"నిన్నెవరు పెళ్లిచేసుకుంటారు



బాలయ్యా! నీ బండముక్కుతో పెళ్లాన్ని మొట్టితే ఇంకేమన్నావుందీ?" అని కామాక్షి.

"పోనీలే, పెళ్లయిన తరవాత, కావాలిస్తే నా ముక్కు కొరికేద్దువుగానిలే." అని బాలయ్యా.

(34-వ పేజీ తరువాయి)



చేసి మిద్దెమీద పడుకొని మిలమిల మెరిసే నక్షత్రాలను చూస్తూ నిద్రపోయ్యాడు ఉమాశంకర్. ఆ రాత్రి నిద్రలో వాడి కొక కల వచ్చింది.

ఒకనాటి పొద్దున్నే ఎవ్వరికీ చెప్పకుండా ఉమాశంకర్ యింటి నుండి పారిపోయాడు. దారిలో నదులు, అడవులు దాటి వెళ్లి చిట్ట చివరకు ఒక కొండదగ్గరికి వచ్చాడు.

ఆ కొండనిండా రకరకాల పండ్ల చెట్లున్నాయి. ఇక ఆ పండ్లకు లెక్కలేనేలేదు చెట్లనిండా. ఎగురుతూ, దూకుదూ, కేకలుపెడుతూ, ఆడుకునే కోతులు వేలకొద్దీ వున్నాయి. అవన్నీ చూచేసరికి ఉమాశంకరుకు నోరూరింది. ఆకలి గూడా ఎక్కువైంది. పరుగెత్తుకొని వెళ్లి కొండ ఎక్కి పండ్లను తినాలని పించింది వాడికి. అయితే కాళ్లుగాని చేతులుగాని కదల్లేదు. ఎంతసేపటికీ కొండకేసి చూడటమే గాని ఎక్కలేకపోతున్నాడు. పండ్లు తినాలనే ఆశ ఎక్కువైపోతూంది. ఎంతసేపో చాలాచాలా వుపాయాలు ఆలోచించాడు కాని లాభం కనిపించలేదు.

ఇంతలో ఒక పెద్ద చెట్టుమీద పెద్ద కోతి ఒకటి కనిపించింది.

"ఓ కోతీ, యిదుగో యిటు చూడు" అని దాన్ని పిల్చాడు. కోతి చూచింది.

"నాకు చాలా ఆకలిగా వుంది. కొండమీద అన్ని పండ్లున్నాయి గదా కాసిని కోసి నాదగ్గర పడ వెయ్యరాదూ?" అన్నాడు.

"పాపం! అయితే యీ కొండ మాది కాదు."

"ఇంకెవరిది? యిక్కడ ఎవ్వరూ లేరే?" అన్నాడు ఉమాశంకర్.

శ్రీ సిద్ధాంతం మల్లికార్జున్

"ఇది ఒక రాక్షసుడిది."

"అట్లాగా, అయితే యిక్కడ మీ రేం చేస్తున్నారు?"

"ఈ కొండకు కావలి కాస్తూంటాము."

"మీరా కావలి కాచేది! మిమ్మల్ని చంపి మనుషు లెవ్వరైనా కొండ ఎక్కిపోతే మీ రేం చేస్తారు?"

"అబ్బే, మమ్మల్ని ఎవరూ ఏమీ చెయ్యలేరు. ఒకప్పుడు మేమూ మీలాంటి మనుష్యులమే!"

"అయితే యిట్లా ఎందుకు మారిపోయ్యారు?" అని అడిగాడు ఉమాశంకర్.

"అదొక పెద్ద కథ. చెప్తాను విను. కొంతకాలం కింద మేమూ నీలాగే యీ కొండదగ్గరికి వచ్చి, యీ పండ్లను చూచి, తినాలని ఆశ పడ్డాం. అప్పుడొక రాక్షసుడు మారువేషంలో వచ్చి మమ్మల్ని పైకి తీసుకువెళ్లి మా కెన్నో రకాల పండ్లు తినడాని కిచ్చాడు. అవన్నీ తినగానే మాకు మంచి నిద్రపట్టింది. నిద్రపోయి లేచేసరికే మే మందరం యీవిధంగా కోతులైనాము. ఆనాటినుండి యీ చెట్లమీద తిరుగుతూ యీ కాయలూ, పండ్లూ తింటూ బతుకుతున్నాము. ఈ కొండ దిగి ఒక్క అడుగైనా అవతల పెట్టలేమిప్పుడు."

"అయ్యయ్యో. వాడెవడో బలే మాయలమారి వాడుగా వున్నాడు. బలే మోసపొయ్యారే మీరు............ సరేగాని రెండు

పండ్లివ్వరాదూ నాకు" అన్నాడు ఉమాశంకర్.

"అట్లా వీల్లేదు. యీ పండ్లు మేము తప్ప యింకెవ్వరూ తిన కూడదు. ఒకవేళ నీ కిచ్చినా ఆ రాక్షసుడు చంపేస్తాడు.

"పోనీ వాడికి తెలీకుండా యివ్వరాదూ."

"అమ్మయ్యో! వాడి కన్నీ తెలుసు. తెలిస్తే నిన్నూ నన్నూ కూడా చంపేస్తాడు."

"అయితే ఒక్కసారి వాణ్ణి చూచి వాడిసంగతి తెలుసుకో వాలి."

"వద్దు బాబూ, వద్దు. నిన్ను గూడా మోసం చేస్తాడు."

"ఏం భయం లేదులే. ఇలాంటి వాళ్లను చాలామందిని చూచాను. వాడి మాయల మారితనం చూడాలి."

చివరికి కోతి ఎట్లాగైతేనేం ఉమాశంకర్‌ను తన వీపుమీద ఎక్కించుకుని రాక్షసుడిదగ్గరకు తీసుకుపోయింది.

రాక్షసు డొక గుహలో మంచంమీద పడుకొనిఉన్నాడు. మంచంపక్కన ఒక పళ్లెంనిండా రకరకాల పండ్లున్నాయి. ఉమా శంకర్ కనిపించగానే రాక్షసుడు నవ్వుతూ మంచంమీద లేచి కూర్చున్నాడు.

"నమస్తే రాక్షసమహాశయా!" అంటూ వాడిదగ్గరి కెళ్లాడు ఉమా శంకర్. ఆ మాట రాక్షసుడికి చాలా చిత్రంగా వుంది. ఇంతవరకు వాణ్ణి అట్లా ఎవ్వరూ పిలవలేదు.

"నీ వేదో చెప్పావే. దాని అర్థం ఏమిటి" అన్నాడు రాక్షసుడు.

"అంటే రాక్షసులందరిలోకీ గొప్పవాడివీ, అందగాడివీ నీవే నన్నమాట." అన్నాడు ఉమా శంకర్.

రాక్షసుడు చాలా సంతోషిం చాడు ఆ మాట విని.

"నీకు రాక్షసులసంగతి బాగా తెలిసినట్లుందే." అన్నాడు.

"ఆc, బాగా తెలుసు."

"ఎట్లా తెలుసుకున్నావు?"

"ఓస్, మా తెలుగుపాఠాల నిండా రాక్షసులేగా! మేము చది వేవన్నీ వాళ్ల కథలే. వాళ్ల బొమ్మలుగూడా నాదగ్గర చాలా వున్నాయి.

"అబ్బాయ్, సరేగాని యీ కొండమీదికెందు కొచ్చావు?" అని ఉమాశంకర్‌ను రాక్షసుడు అడి గాడు.

"నాకు చాలా ఆకలిగా వుంది. ఈ కొండమీది పండ్లు తినాలని వచ్చాను." అన్నాడు ఉమా శంకర్.

రాక్షసుడు వెంటనే లోపలికి వెళ్లి పళ్లెంనిండా పండ్లు తెచ్చి ఉమాశంకరు కిచ్చాడు.

"అబ్బే నాకీ పండ్లు నయిం చవు" అన్నాడు ఉమాశంకర్.

"మరింకేం కావాలి?"

"అదుగో, ఆ కోతితో గూడా వెళ్లి నా యిష్టంవచ్చిన పండ్లు కోసుకొని తింటాను" అన్నాడు.

అందు కా రాక్షసుడు ఒప్పు కొని పండ్లు తినగానే తన గుహకు మరుగెత్తుకొని రమ్మన్నాడు.

ఉమాశంకర్, కోతి వెళ్లి వాళ్ల యిష్టంవచ్చిన పండ్లు తిన్నారు. తర్వాత యిద్దరూవెళ్లి ఒక బావిలో మంచినీళ్లు తాగారు. ఆ బావి గట్టునే పెద్ద మామిడి చెట్టుంది. దాన్ని చూపిస్తూ, "నేను యీ చెట్టు మీదనే వుంటాను. నా సహాయం కావాలంటే యీ చెట్టు దగ్గరికి వచ్చియీల వేస్తే చాలు. వెంటనే వచ్చేస్తాను" అన్నది పెద్ద కోతి.

"సరే నేను రాక్షసుడి గుహకు పోతాను." అన్నాడు ఉమా శంకర్.

"మంచిది. నేను చెప్పిన దంతా మరచిపోవద్దు. మా రూపాలు మారి ఎప్పటిలాగా మనుష్యులం కావాలని మాకెంతో కోరికగా వుంది. అందుకు మే మెంత సహాయమైనా చేస్తాం. జాగ్రత్తగా వుండు సుమా! రాక్షసుడు బలే మాయలమారి." అంటూ కోతి చెట్టెక్కి కూర్చుంది. ఉమాశంకర్ గుహకు వెళ్లాడు.

ఉమాశంకర్ వెళ్లగానే రాక్ష సుడు లేచి వాణ్ణి తన చేతితో పట్టుకొని ఒళ్లో కూర్చోబెట్టుకుని తల నిమురుతూ,

"నాయనా, యింత ఆలస్యం చేశావేం? పండ్లు తిన్నావా? ఆకలి తీరిందా?" అని అడిగాడు.

"ఆc", అంటూ ఉమాశంకర్ త్రేపుకున్నాడు.

"ఇదుగో రా పోదాం. నా గదులు చూద్దువు గాని." అంటూ ఒక పెద్ద గుహలోకి తీసుకొని వెళ్లాడు.

ఆ గదినిండా తళతళ మెరిసే బంగారు, వెండి వస్తువులు, రక రకాల పట్టువస్త్రాలు, రూపాయలు, బంగారు కాసులు, రత్నాలు, వజ్రాలు, పెట్టెలు, అద్దాలు,

ఓ యమ్మ! యిలాంటి వెన్నో వున్నాయి. అవన్నీ చూచి ఉమా శంకర్ భ్రమసిపోయాడు.

"ఎంత బాగున్నాయి!" అన్నాడు ఉమాశంకర్.

"ఇంకా వున్నాయి రా" అంటూ యింకో గదిలోకి తీసుకొని వెళ్లాడు ఉమాశంకర్‌ని.

ఆ గదిమధ్యలో ఒక బంగారు మంచంమీద చక్కని అమ్మాయి కూర్చోనుంది. ఆ అమ్మాయికి పన్నెండేళ్లుంటాయి.

"ఈ అమ్మాయి ఎవరు?"

"ఒక రాజకుమార్తె"

"ఇక్కడి కెట్లా వచ్చింది?"

"ఒకనాడు నేను ఆకాశంలో షికారు వెళ్లుతూ తోటలో ఆడుకునే యీ అమ్మాయిని చూచాను. నాకెంతో ముచ్చటైంది. వెంటనే తెచ్చుకొని యీ గదిలో పెట్టుకొన్నాను. చూడు ఎంత చక్కగా వుందో నా బంగారుతల్లి!"

"ఈ అమ్మాయి పేరేమిటి?"

"హిమకన్య."

హిమకన్య ఉమాశంకరువైపు చూచి నవ్వింది. ఉమాశంకర్ కూడా నవ్వాడు.

"అమ్మాయ్, దా. యీ అబ్బాయిని నీకోసరకే తెచ్చాను. మీరిద్దరూ లక్షణంగా ఆడుకోండి." అంటూ రాక్షసుడు వెళ్లి తలుపు టక్కున బిగించాడు. హిమకన్యను చూచిన సంతోషంలో ఉమాశంకర్ అన్నీ మరచిపోయాడు. రాక్షసుడు తలుపు బిగించడం విని చప్పున వెనక్కు తిరిగి చూచాడు. పాపం వాడి గుండెల్లో రాయి పడ్డది.

"అబ్బాయ్, నామాదిరే నీవూ వున్నాగా దిగులుపడవద్దు. మని యీ రాక్షసుడి చేతుల్లో మోస ద్దరం ఆడుకుందాం. రా, నీ కింకా పొయ్యావా? పాపం! నే ఎన్నో తమాషాలు చూపిస్తాను."

అంటూ హిమకన్య వాణ్ణి యింకో గదిలోకి తీసుకొని వెళ్లింది.

ఆ గదినిండా రకరకాల వజ్రాలు, రత్నాలు కుప్పలు కుప్పలుగా వున్నాయి. ఉమాశంకర్ అవన్నీ చూస్తూండగా ఒకమూల ధగధగ మెరిసే, నీలిరంగురాయి కనిపించింది. వెళ్లి ఆ రాయి తీసుకున్నాడు ఉమా.

"హిమకన్యా! చూడు. యీరాయి ఎంత అందంగా మెరుస్తూందో!"

"ఏదీ?" అంటూ తీసుకొని, "అబ్బ! ఎంత బాగుంది! యింత కాలంనుంచీ యిది నాకంట బడలేదే." అన్నది హిమకన్య.

అది తన బంగారుహారంలో గుచ్చి అద్దంలో చూచుకొని ఎంతో మురిసిపోయింది ఆ పిల్ల.

"బాగుందా?"

"ఆఁ, అచ్చంగా దేవకన్యలా వున్నావు" అన్నాడు ఉమాశంకర్. దాన్ని పట్టుకొని చూస్తూ. అదేం ఆశ్చర్యమో వెంటనే హిమకన్య దేవకన్యగా మారింది. ఇప్పుడింకా అందంగా వుంది. ఒకరి నొకరు చూచుకొని ఆశ్చర్యపడి చాలా మురిసిపోయ్యారు.

"ఉమాశంకర్, యీ రాయిలో ఏదో మహాత్యం వుంది."

"అవును. నేను పట్టుకొని ఏం చెపితే అది అయిపోయింది...హిమకన్యా! యీ రాయితో మనం యిక్కడినించి తప్పించుకొని పోదాం."

"అహా, కాదు. దానికి వేరే ఉపాయం ఆలోచిద్దాం. ఈ రాయి సహాయంతో వెళ్లామంటే రాక్షసుడు మన సంగతి తెలుసుకుంటాడు అంది హిమకన్య. ఇద్దరూ నీలంరాయిని దాచేసి మొదటిగదిలోకి వెళ్లి చాలాసేపు ఉపాయం ఆలోచించారు.

ఇంతలో రాక్షసుడు తలుపు తీసుకొని లోపలికి వచ్చాడు.

"నాయనా బాగున్నారా."

"నా కేమీ బాగా లేదు." అన్నాడు ఉమ.

"మాకు ఆడుకోడానికి యీ చోటు చాల్లేదు" అని చిరునవ్వుతో చెప్పింది హిమకన్య.

రాక్షసుడికి హిమకన్య మీద ఎంతో ప్రేమ.

"అయితే ఎక్కడికి వెళ్తావమ్మా"

"ఇవ్వాళ మేమిద్దరం కొండ మీద ఆడుకుంటాం. అక్కడ గమ్మత్తులన్నీ చూడాలి" అన్నది హిమకన్య.

రాక్షసుడు అందుకు ఒప్పుకోక తప్పింది కాదు. వాళ్లిద్దరికి తన సేవకుణ్ణి తోడిచ్చి పంపాడు. ఆ సేవకుడు అసాధ్యుడు. ఆవలిస్తే పేగులు లెక్కపెట్టేవాడు.

హిమకన్య ఉమాశంకర్ యిద్దరు యిష్టం వచ్చినట్లు తిరిగారు. ఆడారు పాడారు. ఇవన్నీ చేసేసరికి వాళ్లకి దాహంవేసింది. సేరుగా కొండమీది మంచినీళ్ల బావికి వెళ్లారు. సేవకుడు బావిగట్టుమీద నిల్చొని బావిలో దిగి మంచినీళ్లు తాగేవాళ్లిద్దర్నీ చూస్తూ అటూ, యిటూ తిరుగుతున్నాడు. వాళ్లిద్దరూ దాహం తీర్చుకొని గట్టు మీదికి వస్తూండగా సేవకుడికి కూడా దాహం పుట్టింది. గబగబా దిగి బావిలో ఒంగి మంచినీళ్లు తాగుతున్నాడు.

ఉమాశంకర్, చిన్న యీల వేశాడు. బావిపక్కనే చెట్టుమీద నివసిస్తూందిగా పెద్దకోతి. ఈల విని, ఉమాశంకరువైపు చూసి "ఏం?" అన్నది.

కంటిసైగతో మంచినీళ్లు తాగే సేవకుణ్ణి కోతికి చూపించాడు ఉమాశంకర్. ఇంకేముంది గభీలున పెద్దకోతికాస్తా సేవకుడిమీద కొండలాగా పడ్డది. ఆ దెబ్బతో సేవకుడు బావిలో మునిగి, అడుక్కుపోయాడు. ఇక వాడి అంతూ పంతూ లేనే లేదు.

ఈసంగతి రాక్షసుడికి అప్పుడే తెలిసింది. చివాలున లేచి నిప్పులు గక్కుతూ బావిదగ్గరికి బయలుదేరాడు. కొండమీది కోతులన్నీ గబగబా బావిదగ్గరికి పరుగెత్తాయి.

నిప్పులు గక్కుతూ, కోరమీసాలు మెలేసుకుంటూ, గుడ్లురచేసుకొని గబగబా వచ్చాడు రాక్షసుడు. కోతులన్నీ గడగడ వడకిపోతున్నాయి.

(35-వ పేజీ చూడండి)

దగ్గరకి తీసుకెళ్లారు. హాల్లో ఉన్న వాళ్లందరూ ఆశ్చర్యపడ్డారు.

ఈమాటు అందరూ జడ్జీకేసే కాదు టామ్‌వంకకూడా అద్భుతంగా చూస్తున్నారు. పిల్లలంతా అసూయపడ్డారు. గోళీలూ, అవీ తీసుకుని టిక్కెట్లిచ్చినవాళ్ల సంగతి చెప్పనే అక్కర్లేదు. వీడి కెందు కిచ్చామా అనుకుని మరింత రోషంతో ఉడికిపోతున్నారు.

పెద్ద ఆర్భాటంతో పొగడ్తలతో టామ్‌కి బహుమతీ ఇచ్చారు. టామ్‌కి లోలోపల బెరుగ్గానేవుంది. తనలో ఎంత సరుకుందో తనకే తెలుసును. ఆమీ లారెన్స్ ప్రేమతో, గర్వంతో టామ్‌వంకనే తదేకంగా చూస్తోంది. టామ్ తన వంక చూడాలని కోరుకుంది. కాని వాడు ఆమె చూపుల్నించి తన చూపులు తప్పించుకుంటున్నాడు. ఆమెకి కొంత ఆశ్చర్యం కలిగింది. క్రమంగా ఏదో అనుమానంకూడా కలిగింది. పరీక్షగా వాడిని చూసింది. వెంటనే ఆమెకి అర్థం అయింది. భంగపడిన ఆమె హృదయంలో అసూయ భగభగమండ నారంభించింది. కోపం వచ్చింది, కళ్లు నీళ్లతో నిండాయి.

టామ్ నోరు మెదపడంలేదు. గుండె గబగబా కొట్టుకుంటోంది. జడ్జిగారు టామ్ తలపైన చెయ్యి వేశారు.

"నీపే రేమిటమ్మా" అని అడిగారు.

టామ్‌కు ఊపిరి నిలిచిపోయినట్టయింది. బలవంతాన మాటలు పెగిలి వచ్చాయి. "టామ్"

"ఆహాహా టామ్ అనకూడదు..."

"థామస్"

"ఆ. అలాగ, అయితే సరే, అంతేనా నీపేరు? ఇంకా వుంది కాదూ? చెప్పమరి"

"నీపేరు పూర్తిగా చెప్పు నాయనా. చివర సర్ అనికూడా అనాలి ఆయనతో."

"థామస్ సాయర్ సర్"

"అదీ, అలాగ, నువ్వు మంచివాడవ్, అబ్బ రెండువేలపద్యాలు కంఠతా పట్టావ్! అల్లా కష్టపడి నేర్చుకోవాలి. అదే గొప్పవాళ్ల లక్షణం, నువ్వుకూడా పెద్దవాడివైన తరవాత ఇంకా నేర్చుకుంటావ్. గొప్పవాడవుతావ్. ఏదీ నువ్వు నేర్చుకున్నవాటిలో రెండుపద్యాలు చదువు వింటాం అందరమూ. ముందు శిష్యులు పన్నెండుగురిపేర్లు చెప్పచూద్దాం"

టామ్ చొక్కా బొత్తాం పట్టుకుని నలుపుతున్నాడు. బుర్ర వొంచుకున్నాడు. ముఖం, ముక్కు ఎర్రబడ్డాయి. కాళ్లు వొణికిపోతున్నాయి. వాణ్ణి చూస్తుంటే వాల్టర్‌కి గుండెలు జారిపోయాయ్. తెల్లమొహం వేశాడు. హు. ఎందుకొచ్చిందిరా బాబూ ఈపీడ అనుకుంటున్నాడు.

"జవాబుచెప్పు థామస్, జడ్జీగారడుగుతున్నారు. భయపడకూడదు."

టామ్ తలెత్తలేదు, నోరు మెదపలేదు.

ఈమారు జడ్జీగారి భార్య అడిగింది. "నాకు చెప్తావు కాదు బాబూ, మంచివాడవ్, చెప్పు పన్నెండుగురు శిష్యులూ ఎవరు?"

"డేవిడ్, గోలియాట్"

వాల్టర్ గతుక్కుమన్నాడు. జడ్జీగారిభార్య నిర్ఘాంతపడి కుర్చీలో వెనక్కి చేరబడింది. ఇహ మరి ఏం జరిగిందో చెప్పడం కంటె మానడం మంచిది. పాపం టామ్.



సినీమా

25-10-50

# కమల్ అమ్రోహి

**12** వ యేట రచయితగా, 19 వ యేట సంపాదకుడుగా, 20 వ యేట గ్రంథ కర్తగా — క్లుప్తంగా చెప్పాలంటే యీనాడు ఉన్నతస్థానాన్ని అధిష్ఠించిన యువ దర్శకుడుగా కమల్ అమ్రోహిని పరిచయం చేయడం అవసరం. 'పుకార్' చిత్ర రచనలో తెలుగులోకి వచ్చిన కమల్ అమ్రోహి యీనాడు బాంబేటాకీస్ వారి 'మహల్' చిత్రానికి రచయితగా, దర్శకుడుగా మరింత వెలుగులోకి వచ్చాడు.

వెండి తెరమీద ప్రత్యక్షం కావాలని అమ్రోహి తలుచుకుంటే యీపాటికి అగ్రశ్రేణికి చెందిన నాయకుడు కాగలిగేవాడే.



ప్రతిభా వారి 'స్వప్న సుందరి'లో
ప్రభ- నాగేశ్వరరావు

దర్శకత్వం నిర్వహించడంచేత నాయకుని గా నటించటానికి అట్టే శ్రమపడ నవసరంలేని మాట నిజం. కండ్లకు మిరుమిట్లు గొల్పే అతని ముగ్ధ సౌందర్యం, వీనుల కింపుగావుండే అతని కంఠస్వరం, నటులకుండవలసిన సర్వ హంగులూ అతనికివున్నా తెర వెనుకనే వుండిపోవడం గమనించవలసిన విషయం. అందుచేతనే అమ్రోహి చిత్రానికి మూలస్తంభాలైన రచనలు, సంభాషణలు మొదలైనవాటితో ఎల్లప్పుడూ కుస్తీ పడుతుంటాడు.

అమ్రోహిని సినీ రచయితగా ప్రథమంగా ప్రపంచానికి పరిచయం చేసిన చిత్రం మినర్వామూవిటోన్ వారి 'జైలర్' సాంఘిక చిత్ర రంగంలో ఉత్కృష్ట స్థానాన్ని సంపాదించిన ఆ చిత్రంలో అమ్రోహి పరిపూర్ణోత్సాహితుడయ్యాడు. తరువాత సొహరాబ్ మోడీ తయారుచేసిన అసమాన చారిత్రాత్మక చిత్రమైన 'పుకార్'తో అతని కలం పదునెక్కింది.

కళావిశిష్టత దృష్ట్యా ఉత్తమ చిత్రంగా పొగడబడుతున్న 'మహల్' చిత్రానికి రచయిత, దర్శకుడు అయిన అమ్రోహి తన ప్రథమ దర్శకత్వంలోనే ప్రతిభావిశేషాలను ప్రదర్శించాడంటే అందుకు కారణం అతను చిత్రపరిశ్రమలో 'జైలర్' నుండి నేటివరకు చేస్తున్న అవిరామ కృషే నని చెప్పాలి. నూతన పంథాలో నడచిన మహల్ చిత్రం ఎవరికీ అర్థం కాదంటే అందులోనే ప్రత్యేక విశిష్టత వుందంటాడు మిస్టర్ అమ్రోహి.

బాంబేటాకీసులో రచయితగా, దర్శకుడుగా కాంట్రాక్టు వ్రాసుకు నేవరకు అతను కెమేరా ముఖం తొంగి చూసి యెరుగడు. అయినప్పటికీ చిరకాలానుభవం గల వానివలె 1948 వ సంవత్సరం నవంబరు నెలలో తన ప్రథమచిత్రాన్ని సెట్స్ మీదికి తీసుకు వెళ్లాడు. 1949 వ సంవత్సరం ఆగస్టు మాసంలో పూర్తిగాబడ్డ ఆచిత్రం (మహల్) సెప్టెంబరులో సెన్సారై దేశమంతా విడుదలైంది.

బాంబేటాకీస్‌వారికి అధిక లాభాన్ని చేకూర్చిన యీ 'మహల్' చిత్రం రూ. 6,85000 లకు నిర్మించబడి పది లక్షల రూపాయలకు అమ్మబడింది. మధుబాలను తారాపథానికి తెచ్చిన యీ చిత్రం విడుదలైన ప్రతిచోటా విజయధంకా మ్రోగించింది. చిత్రపరిశ్రమలో యీనాడు మధుబాలకు డిమాండ్ హెచ్చిందంటే అదంతా 'మహల్' మాహాత్మ్యమే.

పంజాబ్‌లోని అమ్రోహి జమిందారు కుటుంబానికి చెందిన యీయన 1946 లోని మతకలహాల మారణహోమానికి తీవ్రంగా గురైనాడు. చిత్రపరిశ్రమనంతా ఊపివేసిన ఆ మతకలహాల రోజుల్లో అమ్రోహి కొంతకాలం కొండల్లో ఏకాంతంగా సంచరిస్తుండేవాడు. ఆ పర్యటనల కాలంలోనే 'మహల్' గాథను అత్యంత రమణీయంగా వెలువరించాడు.

6 వ యేట బడిలో ప్రవేశించిన అమ్రోహి 16 వ సంవత్సరానికి పర్షియా, అరబిక్, ఉర్దూ భాషలలో ప్రావీణ్యత సంపాదించాడు. ఉర్దూ సాహిత్యంలో ఇతనికి గాఢమైన పరిచయంవుంది. పర్షియన్ ఆనర్స్ ఉత్తీర్ణుడైన తరువాత లాహోర్‌లో ప్రచురించే ఉర్దూ దినపత్రిక 'ఖిలాఫ్' సంపాదక వర్గంలో చేరాడు. అంతటితో ఆగక 'ఆలంగీర్' అనే మాసపత్రికకు కొన్నాళ్లు సంపాదకత్వం నిర్వహించాడు. పిదప పర్షియన్, ఉర్దూ సాహిత్యంలో పంజాబ్ టెక్స్ట్‌బుక్ కమిటీ మెంబర్‌గా చాలకాలం పనిచేశాడు.

అమ్రోహి వ్రాసిన ప్రథమ గ్రంథం 'పరదేశీ.' ఆ పుస్తకాన్ని బెంగాలీ భాషలో తర్జుమా చేయబడిన తరువాత మదన్ పిక్చర్స్ వారు (కలకత్తా) రూ 1000 లతో ఆ గ్రంథపు సర్వహక్కులూ కొనడానికీ, అతనిని శాశ్వత జీతపు పద్ధతిపై తెర వెనుక కథలు వ్రాయడానికి నియమించాలని విశ్వప్రయత్నాలు చేశారు. కాని అతని 'పరదేశీ' ఎప్పటికీ చిత్రరూపంలో బయిట పడలేదు. యువకత్వంలో ఉరకలు పెడు

తున్న అమ్రోహి కవిత్వాన్ని గ్రహించిన హెచ్. యం. వి గ్రామఫోన్ కంపెనీ మేనేజరు అభ్యర్థనపై రికార్డులకు పాటలు వ్రాయటం మొదలుపెట్టాడు మీరాబాయ్ భజన గీతాలతోసహా 150 పాటలు వ్రాసిన తరువాత కలకత్తాలోని హెచ్. యం. వి. గ్రామఫోన్ కంపెనీకి ఒక సలాం కొట్టి 1938 లో బొంబాయి చేరుకున్నాడు

అమ్రోహిని చిత్రసీమలోకి తెచ్చిన వాడు హిమాంశురాయ్. ఈ నాటికీ బ్రహ్మాండమైన చారిత్రాత్మక చిత్రంగా పరిగణింపబడుతున్న 'పుకార్'తో చిత్ర రచయితగా స్థానాన్ని కల్పించినవాడు సొరాబ్ మోడీ. తరువాత యితని రచనా విశేషాలు కర్దార్ తీసిన 'షాజహాన్'తో బయిటపడినై. నిన్న మొన్నటిదాకా కోర్టు తగాయిదాలతో విడుదలకాని 'బైరంఖాన్' చిత్రానికి యితని వాడికలం పదును పెట్టింది అమ్రోహి, కథ సంభాషణలు వ్రాసిన 'మొగల్ - యి - అజామ్' చిత్రం యింకా పూర్తికాలేదు మధుబాల, అశోక్ కుమార్ లతో 'మెహబూబా' అనే చిత్రాన్ని తన సొంత ప్రొడక్షన్ క్రింద తీయడానికి ప్రస్తుతం యీయన సర్వసన్నాహాలు పూర్తి చేసుకుంటున్నాడు భారత సినీ రంగంలో సంచలనం కలిగించడానికి యీ చిత్రాన్ని బొంబాయి, పారిస్, లండన్, జ్యూరిచ్, మిలాన్ మొదలైన నగరాలలో షూటింగ్ జరపడానికి త్వరలోనే యూరప్ ప్రయాణం కానున్నాడు.

అమ్రోహి వ్రాసిన చిత్రాలు పొందిన విజయాన్ని బట్టి యీనాడు చిత్రపరిశ్రమలో అతనికున్న విలువను యిట్టే గుర్తించ వచ్చు. చిత్రసీమలో దూకబోయే యువ రచయితలకు కమల్ అమ్రోహి పొందిన అనుభవాలు నెమరవేసుకోవడం అవసరం..

"భారత్ జ్యోతి" నుండి



విజయావారి "పాతాళభైరవి"లో నర్తకి లక్ష్మీకాంతం, కొత్త హాస్యనటుడు [illegible]

## బండముక్కు బాలయ్య

(26-వ పేజీ తరువాయి)

కామాక్షి బాలయ్య చుట్టూ చప్పట్లు కొడుతూ, తిరుగుతూ,

"పోవయ్యా బాలయ్యా
బండముక్కు బాలయ్యా."
అని పాడేది.

బాలయ్యకి చిన్నతనంవేసి మొహంముడుచుకుని వెళ్లిపోయేవాడు.

చివరికి కామాక్షి తండ్రి ఆమెని ఆవూళ్లోనే వున్న షావుకారు కాశయ్యగారి కొడుకు కొండయ్యకి ఇచ్చి పెళ్లిచెయ్యటానికి నిశ్చయించుకున్నాడు. కొండయ్య అనాకారి; నల్లగావుంటాడు; అయినా వాడి ముక్కు మాత్రం బాగానే వుంటుంది, అందుకని కామాక్షి వాడిని పెళ్లిచేసుకొనటానికి వప్పుకుంది.

ఈ సంగతి బాలయ్యకి తెలిసింది. కాని ఏంచేస్తాడు? ఇంటి అరుగుమీద ఒక్కడే కూర్చుని "ఈ దిక్కుమాలిన బండ ముక్కుమూలానగదా. ఇన్ని తిప్పలు? దీన్ని చూసేగదా, కామాక్షి నన్ను పెళ్లిచేసుకోనంది?" అని ముక్కునలుపుకుంటూ విచారిస్తున్నాడు. ఇంతలోకె ఒక రామచిలుకవచ్చి చూరుమీద వాలింది. బాలయ్య ఏడుస్తూవుండటం చూసి,

"బాలయ్యా, బాలయ్యా
ఎడుపెందుకు బాలయ్యా"
అని అడిగింది.

బాలయ్య తన సంగతంతా చెప్పాడు. చిలుక అదివిని "ఓస్, అంతేనా, యింతమాత్రానికే ఏడుస్తావా బాలయ్యా!" అంది.

"ఆ నీకేం తెలుసు, బండ ముక్కువల్ల వచ్చే చిక్కులు? నీకు చక్కగా ఎర్రటి, అందమైన ముక్కుంది గనక సరిపోయింది. నీకూ నాలాంటి ముక్కుంటే తెలిసేది." అన్నాడు బాలయ్య.

"బాలయ్యా, నీకు సహాయం చేస్తాను నేను. నామాటవింటావా?" అంది చిలక.

"ఓ తప్పకుండా."

"అయితే నా రెక్కల్లోఒక ఈకనునీకిస్తాను. దాన్ని నువ్వు తేనెలో ముంచి ఎండబెట్టు. తరువాత దాన్ని......"అని ఏదో ఒక మంత్రాన్ని, ఎవరన్నా వింటారేమోనని చిలుక బాలయ్యచెవులో చెప్పింది.

సరే బాలయ్య, చిలుక యిచ్చిన ఈకను పట్టుకుపోయి అదిచెప్పిన ప్రకారం చేశాడు. తరవాత అద్దం ముందుకువెళ్లి, ముక్కు ఒకసారి చూసుకున్నాడు. ఈకను ముక్కుమీదరాసి,

"బండముక్కు తగ్గిపో,
బండముక్కు తగ్గిపో."

అని మంత్రించాడు. వెంటనే తమాషాగా అతని బండముక్కు తగ్గిపోయి, సరిగ్గా ఎంతవుంటే బావుంటుందో అక్కడ ఆగింది. బాలయ్య అద్దంలో చూశాడు. గుర్తుపట్టలేనంత అందంగా మారిపోయాడు అతను. సంతోషంతో గబగబా మంచిఇస్త్రీ బట్టలు వేసుకుని కామాక్షియింటికి బయల్దేరాడు. వెళ్లేటప్పుడు ఈకను ముక్కుకు తాకించి "బండముక్కు పెరిగిపో, బండముక్కు పెరిగిపో." అన్నాడు. ముక్కు మళ్ళీమామూలుగా అయిపోయింది.

కామాక్షి యింటికి వెళ్ళేటప్పటికి వాళ్లనాన్న యింట్లో గుర్రుపెడుతూ నిద్ర పోతున్నాడు. కామాక్షి పువ్వులు గుచ్చుకుంటూ కూర్చునుంది. బాలయ్య వెళ్లి "కామాక్షీ! నన్నుపెళ్లిచేసుకుంటావా? చేసుకోవా?" అని అడిగాడు. "ఏం, నిన్నుపెళ్లి చేసుకోకపోతే, ఏం చేస్తావ్." అంది కామాక్షి. ఏం చేస్తానా?" అంటూ బాలయ్య దగ్గిరికివెళ్లి చిలుక ఈకను కామాక్షి ముక్కుకి రాచి మంత్రాన్ని లోపలే చదివాడు. కామాక్షిముక్కు చూస్తుండగానే పెరిగి పోయింది. బాలయ్య పకపకా నవ్వుతూ,

"కొంగముక్కు, కామాక్షీ!
బుంగముక్కు కామాక్షీ!"

అని పాడటం ప్రారంభించాడు. కామాక్షి ఏమిటా ముక్కు దురద పెడుతుందని ముక్కు పట్టుకుంది. ముక్కు ఇంకా పెరిగి పోయింది. జానెడు ముక్కయింది. ఇంకా పెరుగుతూనేవుంది. "బాబోయ్, అని కామాక్షి గతులు వేయటం మొదలెట్టింది.

ఇంతలోకే కొండయ్య తనుపెళ్లిచేసుకోబోయే కామాక్షిని చూసిపోవాలని అక్కడికి వచ్చాడు. కామాక్షిని, అమెముక్కునీ చూసి "ఇదేమిట్రో ఇల్లావుంది." అనుకుని గుండెలు బాదుకున్నాడు.

బాలయ్య. "ఆ నువ్వుమహా అందంగావున్నావులే." అని చిలకయీక కొండయ్య ముక్కుకి తగిలించి

"కొంగముక్కు కొండయ్యా!
కొంగముక్కు కామాక్షి!"
అనిపాడాడు.

కొండయ్య ముక్కు మరీ దబ్బున పెరిగి పోతోంది. దానిబరువు మొయ్యలేక కొండయ్య చదికిల బడ్డాడు. బాలయ్య కాళ్ళమీదపడి వేడుకున్నాడు ముక్కుని తగ్గించ మని.

"నువ్వు కామాక్షిని పెళ్ళిచేసు కోనని వెళ్ళిపోతే తగ్గిస్తా" నన్నాడు బాలయ్య. అల్లాగేనని ఒప్పు కున్నాడు కొండయ్య. బాలయ్య చిలుకయీకని కొండయ్య ముక్కుకి తాకించాడు. అతని ముక్కు మామూలుగా అయిపోయింది. "బతుకు జీవుడా!" అని కొండయ్య ఇంటికి పారిపోయాడు.

"ఏమే. కొంగముక్కు కామాక్షీ! నన్ను ఇప్పటికైనా పెళ్లి చేసుకుంటావా?" అని అడిగాడు బాలయ్య.

"నాముక్కు తగ్గించివేద్దూ. అల్లాగే పెళ్లిచేసుకుంటాను." అంది కామక్షి.

బాలయ్య చిలక యీకను ముందు తనముక్కుకి తగిలించాడు. చాల అందంగా తయారయ్యాడు. అతన్ని చూసి కామాక్షి మురిసిపోతుంది. తరవాత ఈకని కామాక్షి ముక్కుకి రాశాడు. ఆమెకి మామూలు అందం తిరిగి వచ్చింది.

ఆతరవాత బాలయ్య దగ్గిర చిలక యీకని చూసి భయపడి కామాక్షి తండ్రి కూతురుని బాలయ్యకిచ్చి పెళ్లి చేశాడు. బాలయ్యా, కామాక్షి ఇద్దరూ సుఖంగా ఉన్నారు."

"కథ బావుందా, బుల్లెమ్మా!" అని కామయ్య అడిగాడు. మా చెల్లాయి అప్పటికే నిద్రపోయింది.

---

## కొండమీది రాక్షసుడు

(30-వ పేజీ తరువాయి)

"ఓరేయ్ అబ్బాయ్. నా సేవకుణ్ణి బావిలోకి తోసింది నీవేనట్రా." అన్నాడు.

"అవును." అన్నాడు ఉమ నవ్వుతూ.

"ఓరి భడవ! నన్ను దగ్గర తీస్తే యింత మోసం చేస్తావా! ఎక్కడుందిరా పెద్దకోతి."

ఈమాట అనేసరికి పెద్దకోతి అదురుకొని చెట్టుమీదినుంచి దూకి ఉమకాళ్లదగ్గిర కొచ్చింది.

"చూడండి మిమ్మ ల్నేం చేస్తున్నానో" అంటూ రాక్షసుడు తన మొలలో వుండే యినపకడ్డీ తీశాడు.

"ఏయ్ రాక్షసుడా, ఆగు" అని దబాయించాడు ఉమాశంకర్. చప్పున హిమకన్య మెడలో హారం తీసుకొని చేతిలో పట్టుకొని,

"ఏమోయ్ రాక్షసుడా! పాపం యీ అమ్మాయినీ, యీ కోతులనూ మోసంచేసి నన్నూ బుట్టలో వెయ్యాలనుకున్నావా! ఇకనుంచీ ముసలితాతలాగా యీ కొండ మీదనే పడివుండు. నీ మాయ లన్నీ మాయమైనాయి." అన్నాడు ఉమాశంకర్.

ఆ క్షణంలోనే రాక్షసుడు పండు ముసలివాడై అక్కడే కూలబడ్డాడు. కోతులన్నీ సంతోషంతో కేకలు వేసి చెట్లమీద ఎగిరెగిరి దూకాయి. తక్షణమే కోతులన్నిటినీ మనుషులుగా మార్చాడు. వాళ్లందరూ ఎంతో సంతోషించి ఉమాశంకర్ కాళ్లమీద పడి నమస్కారాలు చేశారు. అప్పటి కప్పుడే వాళ్లందర్నీ నీలంరాయి మహిమవల్ల వాళ్లవాళ్ల వూళ్లలో చేర్పించాడు ఉమ.

కొండమీద హిమకన్య, ఉమాశంకర్ మాత్రమే వున్నారు.

"హిమా! మనం యిక్కడ్నే వుందామా?"

"వద్దు మావూరికిపోదాం. మా అమ్మా, నాన్ననుచూచి చాలా రోజులైంది. తొందరగా పోదాం" అన్నది హిమకన్య.

ఇంకేం నీలంరాయి సహాయంతో మరుక్షణంలో హిమకన్య పట్టణం చేరారు. హిమకన్య తండ్రి కథంతా విని తన కుమార్తెను రక్షించినందుకు ఆ అమ్మాయి నిచ్చి ఉమాశంకరుకు పెళ్లిచేశాడు.

పెళ్లికూతురూ, పెళ్లికొడుకూ ఊరేగుతూండగా ఉమాశంకరుకు తటాలున మెళుకువ వచ్చింది.

అప్పుడే తెల్లగా తెల్లవారింది.

"నీలంరాయి, నీలంరాయి" అంటూ ఉలిక్కిపడి లేచాడు ఉమాశంకర్.

"నీలంరాయేమిట్రా నీ తల కాయ" అన్నాడు వాడి నాన్న. అందరూ నవ్వారు.

---

# భూమిమీద జరిగిన వింతలు

ఇక భూమిమీద జరిగిన విశేషాలను గూర్చి తెలుసుకుందాం. భూమిపుట్టి దాదాపు 200 కోట్ల ఏళ్లకు పైగా అయిందని, 100 కోట్ల ఏళ్లదాకా భూమిచల్లపడటం, గాలి, నీరు, నేలవగైరాలు రావటం జరగలేదని శాస్త్రజ్ఞులు మనకు చెబుతున్నారు. అంటే అంతవరకూ భూమిమీద జంతువులు, చెట్లు బతకటానికి వీలైన పరిస్థితులు రాలేదన్న మాట. గాలీ, నీరూ లేనిదే ఏ ప్రాణీ బతకలేదు.

## మొదటి ప్రాణులు

అయితే మొదటగా ప్రాణం అనేది భూమిమీద ఎల్లా పుట్టిందో మనకి తెలియదు. దేవుడు పుట్టించాడని మనపూర్వీకులు అనుకున్నారు. కాని దేవుడనే వాడు, ఉన్నాడో లేడో ఎవరికి తెలుసు. కొందరు ఉన్నాడంటూ కొన్ని కారణాలు చూపిస్తారు. మరికొందరు లేడంటూ కొన్ని కారణాలు చూపిస్తారు. ఈ రెంటిలో ఏదినమ్మటానికీ తోచక జనం సందేహంలో పడ్డారు. అంచేత ప్రస్తుతానికి ఆ విషయం వదిలేద్దాం.

ప్రాణం అనేది ఎల్లా పుట్టిందీ మనం చెప్పలేము. కాని మొదటగా భూమిమీద పుట్టిన ప్రాణులు చెట్లజాతికి చెందినవేనని, జంతువులు కాదని శాస్త్రజ్ఞులు కనుక్కున్నారు. చెట్లకి ప్రాణం ఏమిటని మీరడగవచ్చు. కాని చెట్లు నడవటం, మాట్లాటం, ఎగరటం ఇల్లాంటి పనులేమీ చెయ్యకపోయినా, వాటికీ ప్రాణంవుంది. అవికూడా తిండిని సంపాదించుకుని తింటాయి. గాలి పీల్చుకుంటాయి. భూమి పైకో, కిందకో మొత్తానికి ఎదుగుతాయి. గింజలు తయారు చేసుకొని పిల్లల్ని కంటాయి. కనక అవీ ప్రాణులే.

చెట్లజాతి ప్రాణులు మొదటగా నేలమీద పుట్టలేదు. సముద్రపు అడుగున పుట్టాయి. వాటికి గాలిని ఆకాశంలోంచి సరాసరి పీల్చుకునే శక్తిలేదు. నీళ్లలో వుండే గాలినే పీల్చుకునేవి. ఆకాలపు నీటిచెట్లకి ఆకులులూ కొమ్మలూ, కాయలూ ఉండేవికావు. క్రమంగా నీళ్లలోంచి నేలమీదకు జరిగికొమ్మలు. ఆకులు పెంచుకుని, నేలలోకి వేళ్లు దింపి సూర్యరశ్మి ద్వారాను, నేలలోని నీటిద్వారాను కావలసిన ఆహారాన్ని, గాలిని, సంపాదించటం నేర్చుకున్నాయి.

ఇక మొదట జంతువులుకూడా నేలమీద పుట్టలేదు. నీళ్లలోనే పుట్టాయి. వాటికికూడా ఆ కాశంలోంచి సరాసరి గాలిని పీల్చుకునే శక్తిలేదు. నీళ్లలో కరిగివున్న ప్రాణవాయువునే పీల్చుకునేవి. అసలు చెట్లజాతిప్రాణులే చిన్న చిన్న సూక్ష్మజీవులుగా మారాయి. ఆ సూక్ష్మజీవులు మళ్లీ మారి చేపల్లాంటి జంతువులయ్యాయి. ఆ చేపలు కొన్నేళ్లకి మారి పెద్దపెద్ద చేపలు, తిమింగిలాలు మొదలైన మహాజంతువులయ్యాయి.

అయితే ఈ మార్పులన్నీ ఏ అయిదారు ఏళ్లలోనో, వందలు, వేలుఏళ్లలోనో జరిగినవి కాదు, చెట్లజాతి ప్రాణులు సూక్ష్మజీవులుగా, అవి చేపలుగా, ఆ చేపలు తిమింగిలాలు మొదలైనవిగా మారటానికి ఎన్ని కోట్ల ఏళ్లు పట్టాయో చెప్పలేము. అసలు చేపలు, తిమింగిలాలు అంటుంటే ఈ కాలపు చేపలు, తిమింగిలాలని అనుకోకూడదు. ఆ కాలంలో అవి ఎలాగు ఉండేవో మనకు తెలియదు.

చెట్లు ఎలాగైతే నీళ్లని విడిచి నేలమీదకు వచ్చాయో, అలాగే చేపలవంటి ప్రాణులు కూడా నేలమీదికి జరిగాయి. ఆ మధ్యదశలోనే నీటిలోను, నేలమీదనూ కూడా, బతకగల కప్పలు తాంబేళ్ల వంటి జంతువులు పుట్టాయి. ఇవన్నీ మొదట చిన్నచిన్న జంతువులుగా ప్రారంభించి, లక్షలకొద్దీ ఏళ్లు గడిచేటప్పటికి మహాజంతువులయ్యాయి. ఈ కాలపు ఏనుగులు, తిమింగి

లాలు ఆ కాలంలో ఒక లెక్క కాదు. ఏటికి 20, 30 రెట్లు పెద్దవైన జంతువులు కూడా ఆరోజుల్లో నేల మీద, సముద్రాల్లోను సంచారం చేసేవి.

ఈ మహాజంతువులన్నీ తిండి కోసం ఒకదానితో ఒకటి యుద్ధం చేసుకుని చంపుకుని తినేవి. ఆరోజుల్లో బలవంతుడిదే రాజ్యం. పెద్దజంతువులు చిన్నవాటిని చిన్నవి ఇంకా చిన్నవాటిని, చంపుకుతినేవి. పైగా అప్పుడు తరుచుగా భూకంపాలు, అగ్నిపర్వతాలు బద్దలవటం జరిగేది. మంచుపాతాలు, ప్రళయాలూ, వచ్చేవి. వాటిలో చచ్చినన్ని చచ్చేవి. మిగిలావి బతికివుంటే మళ్లీ పిల్లల్ని కని తమజాతిని నిలబెట్టుకునేవి. ఒక్కొక్క యుగంలో ఒక్కొక్క రకమైన జంతువులు బలంగావుండి, భూమికంతటికీ చక్రవర్తులుగా వుండేవి.

ఈ జంతువులన్నీ అప్పటికప్పుడు గాలిలోంచి పుట్టినవని మీరెప్పుడూ అనుకోరాదు. చిన్న చిన్న చేపలు మొదట ఉండేవనుకోండి. వాటి పిల్లలు తమ తండ్రులకంటే కొంచెం మారేవి. ఆ పిల్లల పిల్లలు ఇంకా కొంచెం మార్పుగా వుండేవి. ఇలాగ కొన్నిలక్షల ఏళ్లు పోయేటప్పటికి పుట్టే చేపలు మొదటి చేపలకంటే బాగా మారి వుండేవి. ఆ జంతువులు కప్పలుగానో, తాబేళ్లుగానో, తిమింగిలాలవలెనో మారేవన్నమాట. ఈ విధంగా కాలం మారుతున్నకొద్దీ కాలంతోపాటు జంతువులు కూడా మారిపోయి కొత్త జంతువులయ్యేవి.

మనుషుల సంగతి తీసుకుందాం. మనుషులు ఉన్నట్టుండి ఒకరోజున పుట్టలేదు. మనకీ, ఇప్పుడు మనం చూసే కొన్ని రకాల కోతులకీ పూర్వీకులు ఒకళ్లే. ఆ పూర్వీకులు కూడా ఒక రకమైన కోతులే. ఆ కోతులు నశించి వాటి పిల్లలలో కొన్ని మనుష్యులజాతిగానూ, మరి కొన్ని రకరకాలకోతులుగానూ తయారయ్యాయి,

ఇల్లాగే బల్లులూ, పక్షులూ ఉన్నాయి. పోటిరెంటికీ పోలిక ఏ మాత్రమూ లేదు. పక్షులు ఎగురుతాయి. బల్లులు నేలమీదే పాకుతాయి. అయినా వాటి పూర్వీకులు ఒకరకమైన ఆబల్లులు నశించివాటి పిల్లల్లో కొన్ని ఇప్పటి బల్లుల మోస్తరుగా, పాములలాగా తయారయ్యాయి. మరికొన్ని తమ పెడలైన కాళ్లనే రెక్కలుగా మార్చుకుని పక్షులుగా తయారయ్యాయి. అందుచేతే బల్లులూ, పక్షులూ కూడా గుడ్లుపెడతాయి.

అసలు యీ జంతువులన్నిటికీ పూర్వీకులు మొదట చేపలే. అట్టే మాట్లాడితే మన పూర్వీకులు కూడా చేపలే. అందుకనే చేపలకీ మిగతాజంతువులకీ, మనుషులకీ ఒక విషయం పోలిక కనిపిస్తున్నది. చేపలు గాలిని సరాసరి పీల్చుకోలేవని, నేలమీద పడేస్తే ఊపిరాడక గిలగిల కొట్టుకుని చచ్చిపోతాయని మనకి తెలుసు. మిగతా జంతువులు, మనుషులు కూడా సరాసరి గాలిని పీల్చుకోవటం నేర్చుకున్నప్పటికి ఆ పీల్చే గాలిలో కొంత తడిలేకపోతే ఊపిరాడదు. కొంచెం తడిగా వున్న గాలిని పీలిస్తేనే మనం బతకగలం. బాగా పొడిగా వున్న గాలిని పీల్చటం మొదలెడితే, కొంత సేపటికి చచ్చిపోవలసి వస్తుంది.

ఏదైనా సరే అనలింతే. పాత వాటిలోంచి కొత్తవి తయారయినప్పుడు పాతగుణాలు కొన్ని కొత్త వాటిలో తప్పకుండా వుండితీరతాయి. ఎల్లాగంటే — కాస్త కుంకం, సున్నం కలుపుతాము. కుంకంఎర్రగా వుంటుంది. సున్నం తెల్లగా వుంటుంది. ఎరుపూ, తెలుపూ కలిసేటప్పటికి ఒక మాదిరి గులాబీ రంగు తయారవుతుంది. ఆ గులాబీరంగుని పూర్తిగా కుంకమూ అనలేము, సున్నమూ అనలేము. కుంకంలాగా కొంచెం ఎర్రగా వుంటుంది. సున్నం లాగా కొంచెం తెల్లగానూ వుంటుంది. అంటే ఆ రెండిటి రంగూ కొంతగాకపోతే కొంతైనా కొత్తగా వచ్చిన గులాబీ రంగులో వుందన్నమాట.

# పొరపాటు

(8-వ పేజీ తరువాయి)

మెంత ఉత్కృష్టమైనదో మనజీవితాల్లో" అన్నాడు.

"నిస్పందేహంగా ఇది తిరిగి రాదుకదా!" అంది శారద.

"అయితే మరచిపోవుకదా - ఈ బాటసారిని"...గోపాలం "అదెల్లాగసాధ్యం? మరచిపోతే నువ్వే మరచిపోవాలి" అంది శారద.

"అసంభవం. నాజీవితంలో ప్రతిరోజూ ఇల్లాగే గడిస్తే ఎంతబాగుండును" అన్నాడు గోపాలం. గోడవెనకనుంచి మేట్రనుదగ్గింది శారద తడబడుతూ "పోతాను. ఆలస్యమయింది." అంటూతిరుగుతూంది. గోపాలం "శారదా" అంటూ చెయ్యి చాపేడు. శారద వెనుదిరిగి "ఏం?" అంది.

"ఏమీలేదు. శారదా. నువ్వు పోబోతూంటే ఆపూల వాసనలు నన్నాహ్వానించినట్లయింది" అన్నాడు.

శారదకేం బోధపడక, తనతల్లో మల్లెపూగుత్తి తీసి అతనిమీదవిసిరి· లోనికి వెళ్ళిపోయింది. గోపాలం కోర్కె ఫలించినట్లయింది. జన్మాంతర పుణ్యాలేవో ఫలరూపం తాలుస్తున్నాయి!! శారద చూపిన సమ్మతి యిదేనని రూఢిచేసుకున్నాడు. ఆ రాత్రి చదువుతున్నంతసేపూ ఆ పూల గుత్తిని ప్రక్కనే పెట్టుకున్నాడు. ఆ ఘుమఘుమల మత్తులో ఎప్పుడు నిద్రపట్టిందో అతనికే తెలియదు. తెల్లవారేక మేలకువవచ్చి చూసుకున్నాడు. ఆపూలు వాడి వత్తలైపోయేయి. అవిచూస్తే విచారం కలిగిందతనికి. అయినా ఆ యెండిన రేకులే జాగ్రత్త చేసుకోతలుచుకున్నాడు జీవితనిధానాలుగా

పరీక్షలయిపోయేయి. శారద పట్నం వెళ్ళిపోయింది. తండ్రిదగ్గిరికి. గోపాలం తిరిగి వచ్చేసేడు తన కుగ్రామానికి. ఎంత మరచిపోదామనుకున్నా అతను శారదను మరవలేకుండా వున్నాడు. నిరంతరం ఆమె అతని హృదయరంగంలో నృత్యం సలుపుతూంది. ఆమె మాటలతని హృదయకుహరంలో ప్రతిధ్వనిస్తున్నాయి. వెన్నెల రాత్రులలో అతనికి శారద ముఖబింబం గోచరిస్తుంది. చీకటి రాత్రులలో ఆమె వినీలకుంతలాలు, వానిపై ముడిచిన పూరేకలు కనిపిస్తాయి. ఇలాగ ప్రకృతిలోని ప్రత్యణువులోనూ శారద విలాసమే కొంచెమో గొప్పో వ్యక్తమవుతూంటుంది. ఒకరాత్రి శారదకి తనకీగల స్థితిగతులన్నీ సరిచూసుకుని, పోల్చుకున్నాడు. మర్నాడే ఉత్తరం రాసేడు "ప్రియసోదరీ—" అని మొదలుపెట్టి - జవాబు వెంటనే వచ్చింది.

రెండో ఉత్తరం రాసేడు గోపాలం.

"ప్రియసోదరీ శారదా" అని. దానికీ జవాబు వచ్చింది. గోపాలం తిరిగి రాసేడు "ప్రియసోదరీ శారదాదేవీ" అని సంబోధిస్తూ. జవాబు నాలుగురోజులు ఆలస్యమయ్యేక వచ్చింది. గోపాలం కొంచెం ధైర్యం వహించి రాసేడు - "ప్రియమైన శారదా" అంటూ. దానికీ జవాబు వచ్చింది. ఆమెమాత్రం అతనిలా సంబోధనలు మార్చడంలేదు. ఎప్పుడు రాసినా "ప్రియ సోదరా" అనే మొదలుపెడుతుంది. ఈ మాటు గోపాలం తెగించి రాసేడు "ప్రియా!" అంటూ జవాబు రాలేదు— ఈనాటిదాకా!

ఈనాడు గోపాలం జీవితంలో పండుగ. పట్నం రావడమేమిటి, హోటల్లో గది తీసుకోవడమేమిటి, శారద యింటికివెళ్ళి ఆమెను కలుసుకోవడమేమిటి - పనులన్నీ వాటంతటవే జరిగిపోతున్నాయి. గోపాలం తన యింటికి రావడంతోనే ఎన్నో యుగాల తర్వాత కలుసుకున్నట్లు సంతోషించింది శారద. కాలేజీ స్నేహితులని గురించి గంటసేపు మాట్లాడింది. ఆ తర్వాత కవిత్వపురీతులు, అనంతరం రాజకీయాలు ప్రసంగించింది. పిమ్మట భోజనానికి లెమ్మంది. గోపాలం మచ్చుకు కొంచెం బెట్టుసరి చేసి వప్పుకున్నాడు. భోజనం చేస్తున్నంతసేపూ గోపాలానికి వొళ్ళు తెలియలేదు. లోకంలోవున్న ఆనందమంతా తనమీద విరుచుకు పడుతున్నట్లయిందతనికి. 'ఉక్కిరి బిక్కిరి కాకుండా ఈ ఆనందాన్నంతా ఆస్వాదించకలనా' అనే సంకోచంకూడా పొడసూపింది అతని మనస్సులో. మధ్యాహ్నం మూడయింది. గోపాలం మ్యాటినీ సినీమాసంగతి మాట్లాడడమేమిటి, శారద తటిల్లతలా తయారుకావడమేమిటి? సినీమాలో కూర్చున్నట్లైనా తెలియకుండా గోపాలం ఆనందసాగరంలో ఈదుతున్నాడు. అతనిలో· వాంఛా, వివేకం నాగ్వాదం చేసుకుంటున్నాయి.

"ధైర్యం వహించు. సమయం మించిపోతూంది."

"ఎలాగ? ఏమైనా అనుకుంటుందేమో"

"అయితే అంత అధైర్యవంతుడికి త్రిలోకసుందరి వశం కాదు"...

గోపాలం శారదవైపు చూసేడు. ఆమె కళ్లు తెరవైపే వున్నాయి. తెరమీద మెరిసే తెల్లటి కాంతిరేఖ ఒకటి ఆమె బుగ్గలమీద మెరుస్తోంది. "ఎందుకైనా మంచిది తొందరపడి రసాభాస చేసుకోకూడదు"ని గోపాలం నిశ్చయించుకున్నాడు.

సినీమా వదిలేసేరు. ఇంటికి వెడదామంటూన్న శారదనాపి "నారూమ్‌లో పర్సు మరిచివచ్చేను. అది తీసుకు వెడదా"మన్నాడు గోపాలం. శారద మాటాడక అనుసరించింది. హోటల్లోకి వచ్చి, గది తలుపుతీసేడు గోపాలం. వెంటనే శారదకి గోడమీద రాతలు చూపించేడు.

* * * *

"కాఫీ చల్లారి పోతూంది. త్రాగండి" అంది శారద. గోపాలం ఉలిక్కిపడి ఒక్క గుక్కలో పిల్చేసేడు ఎప్పుడో చల్లారిపోయిన కప్పు కాఫీ.

"సరే, యికవెడదామా" అంటూ శారద లేచి చీర కుచ్చెళ్లు సవరించుకుంటోంది. గోపాలం లేచెడు ఆమె ఛోలీ క్రింద మెరిసే తెల్లటి శరీరకాంతుల్ని పరికిస్తూ. బయట రేడియోపాట వినబడుతూంది.

"నీ మురళి మ్రోతలో వలపు పిలుపుందిరా
మ్రోగింపరా మురళి కృష్ణా!"

"ఆ పాట విన్నావా శారదా" అన్నాడు గోపాలం.

"విన్నాను. బాగుంది." అంది ఆమె. గోపాలం కొంచెం తడబడుతూ

"శారదా, ఒక్కమాట చెప్పనా, నా హృదయంలో మాట" అన్నాడు. శారద మాట్లాడకుండా చూస్తూంది.

ధనురాకృతితో నల్లగా మెరసే ఆమె కన్బొమల మరుగున అతనికేవో ఆశాజ్యోతులు కన్పించేయి.

"శారదా. నువ్వు వెన్నెలవు. నేచీకటిలో బ్రతకలేను." అన్నాడు గోపాలం. శారద నిర్ఘాంత పోతూంది. గది తలుపూ మూయబడేవుండడం, అతనూ అలాంటి మాటలు మాట్లాడటం చూస్తే ఏం చెయ్యాలో ఆమెకు తోచలేదు.

"శారదా. నువ్వే నా సర్వస్వానివి తిరస్కరించకు" అంటూ గోపాలం ఆమె చెయ్యిపట్టుకోబోయేడు. ఇంతలో హోటల్ అదిరేట్టు 'టప్' అన్న శబ్దం వ్యాపించిం

జారిపోతున్న పమిట సర్దుకుంటూ, కందిపోయిన అరచేతిని చూసుకుంటూ శారద తలుపు తెరచింది. హోటల్ కుర్రాడు.

"ఏం సార్! కప్పులు క్రింద పడ్డాయా" అంటూ గదిలో అడుగుపెట్టేడు. సమాధానం చెప్పేందుకు గోపాలానికి స్థిమితం లేదు. బయటికి వెడుతూన్న శారదననుసరించేడు. ఆమె సరాసరి వీధి మొగలో జట్కా యెక్కింది. గోపాలం వెనకాలే వచ్చి నిలబడ్డాడు. బండి కదిలింది శారద "శలవు" అంటూ నమస్కారం చేసి మొహం త్రిప్పుకుంది. బండి కనుమాపు మేర దాటే వరకూ గోపాలం అక్కడే వుండిపోయేడు. ఆ తర్వాత వాచిన తన దవడ తడుముకున్నాడు.

*   *   *   *

స్వగ్రామానికి తరలివచ్చినా గోపాలానికి ఆరాటం తగ్గలేదు. ఏం? తనకేంలోటు? ఆస్తిలేదనా? చదువులేదనా? శారద, తనని మోసగించి అవమానం చేస్తుందా? ఒకనాడు తెగించి ఉత్తరం రాసేడుక్లుప్తంగా.

"ప్రియమైన శారదా!

నువ్వేం చేసేవో నీకు తెలుసా!" అని వెంటనే జవాబు వచ్చింది.

"ప్రియసోదరా!

నా పరిస్థితుల్లో వున్న వాళ్లంతా చేసేదే. ఇందులో వింతేముంది? పోనీలే. ఆమాటెందుకింక? నీ క్షేమం తరచు రాస్తూవుండు ఇక్కడ నేనూ, నా భర్తా క్షేమంగా వున్నాం. ఆనందంగా రోజులు గడుపుతున్నాం. వీలైతే ఇంకోసారి రా.

శారద.

గోపాలం చదువుకుని పడకకుర్చీలోనే కొయ్యబారి పోయేడు — "శారద కదివరకే పెళ్ళయిందా" అని. "అయితే ఆమె ఎందుకు చెప్పలేదు? తానెందుకడగలేదు? తప్పక ఈ ముఖ్యవిషయం అడగని పొరపాటు తనదేనని తెలుసుకున్నాడు. వింత కాని వింత యేదో అతన్ని ఆవరించింది 'నువ్వేం చేసేవో నీకు తెలిసిందా' అంది అంతరాత్మ 'నా పరిస్థితిలో వున్న వాళ్లంతా చేసేదే. ఇందులో వింతేముంది' — అని ఆఖరికి సమాధానం చెప్పుకున్నాడు గోపాలం.

---

# దాగిన ద్వేషం

(7-వ పేజీ తరువాయి)

ఇద్దరూ ఒకడాబా ఇంట్లో ప్రవేశించారు. హాల్లో నాలుగు కుర్చీలు, ఒక మేజా వున్నాయి కొద్దిదూరంలో ఒక కాంప్ కాట్ ఉంది. "ఇది ఒక స్నేహితుడి ఇల్లు. ఈ కుడిపక్క ఇంట్లోనే ఒక పెంకుటిల్లుంది. అంకరాజు ఉండేది ఆ యింట్లోనే." అన్నాడు రామచంద్రరావు.

ఎడమవైపున ఒక కిటికీ వుంది. ఆ కిటికీ పక్క చిన్నదొడ్డి, పూల మొక్కలూ ఉన్నాయి ఆపక్క ఒక పెద్ద మేడ కనిపిస్తోంది. మాధవరావు కిటికీలోనుంచి చూశాడు మేడమీద వరండాలో రెండు తలలు కనిపించి హఠాత్తుగా మాయమైనాయి. మాధవరావుకి అనుమానం అధికమయింది.

"రోడ్డుమీద డాక్టర్ మూర్తిగారికారుంది. తీసుకుపొమ్మని డ్రైవరుతో చెప్పి వెంటనే రా పనుంది." అన్నాడు రామచంద్రరావుతో. రామచంద్రరావు వెళ్లిపోయాడు.

---

# మనదేశం

(4-వ పేజీ తరువాయి)

వారికి విరుద్ధంగా ఈ ఆందోళన పనికిరాదని మంత్రి భక్తవత్సలంగారన్నారు. కులద్వేష ప్రచారం కూడదని ముఖ్యమంత్రి కుమారస్వామి రాజాగారు ఉపన్యాసమిచ్చారు. ఉత్తరాదివారికి విరుద్ధంగా ఇలా పికెటింగ్ చేస్తున్న ద్రావిడనాయకులకి భక్తవత్సలంగారు ఒక ఉపదేశమిచ్చారు. భారతదేశంలో నలుమూలలా, పల్లెపల్లెలా వ్యాపించి, స్థిరపడి, ధనమార్జించి, తమిళ్నాడుకి చేరవేసుకుంటున్న తమిళ గుమాస్తాల్ని, అరవ సెక్రటరీల్ని, అరవ సబ్ డివిజనల్ ఆఫీసర్లని, అందరికంటె ముఖ్యంగా అరవ హోటళ్ళవారిని ఉత్తరాదివారు వెళ్ళగొట్టినట్లయితే ఏమౌతుందో ఆలోచించుకోమన్నారు భక్తవత్సలంగారు. ద్రావిడ నాయకులీవిషయాన్ని ఇదివరకే ఆలోచించి ఉన్నారు. లోకమంతటా వ్యాపించిన వారు అరవ బ్రాహ్మణులేననీ, ఆ బ్రాహ్మణులందరూ ఒకప్పుడు ఉత్తరాదివారేననీ, పూర్వశతాబ్దాలలో వారు దక్షిణాదికివచ్చి వలస ఏర్పరచుకున్న వారనీ, కాబట్టే వారిని ఉత్తరాదికి వెళ్లగొట్ట వచ్చుననీ, వారిని ఉత్తరాదివారు లేవగొట్టినా తమకు చింతలేదనీ ద్రావిడనాయకుల సమాధానం.

చెన్నపట్నంలో పికెటింగ్ సందర్భంలో పోలీసులు న్యాయంగా ప్రవర్తించడంలేదని కొందరారోపించారు. మంత్రి గోపాలరెడ్డి గారన్నట్లు ఇటువంటి నింద పోలీసువారిపైన పడవెయ్యడం మామూలయింది. ఇది వాస్తవమో అపనిందో మనకు తెలియదుగాని జరిగిన ఒక సంగతి మాత్రం తెలుసును. పికెటింగ్ చేస్తున్న వారు దౌర్జన్యానికి దిగనిమాట నిజమే. కాని వారి చుట్టూ వందలాది జనం చేరడంతో రాకపోకలకు ఆటంకం ఏర్పడుతున్నదని చెప్పి పోలీసులు నాయకులనుకున్న వారిని ఆరేడుగుర్ని అరెస్టుచేసి స్టేషన్‌కి తీసుకువెళ్ళి దుకాణాలు మూసివెయ్యగానే విడిచిపెడుతున్నారు. ఈ కులద్వేషకారుల ప్రవర్తనకూ పోలీసు లవలంబిస్తున్న పద్ధతుల్నీ గమనించడానికి ఒక స్వామీజీ ఒక గుజరాతీ హోటల్‌కు ఎదురుగా నిలబడి పరిశీలిస్తుండగా, (వీరు ద్రావిడోద్యమానికి వ్యతిరేకులు) వీరిని పోలీసువారు అరెస్టుచేసి నిష్పక్షపాత బుద్ధిని ప్రకటించుకున్నారు.

## ప్రకాశంగారి నోటీసులు

ఋతు ధర్మాన్ననుసరించి మళ్లీ ప్రకాశంగారి నోటీసు మద్రాసు శాసనసభ స్పీకర్‌గారికి అందింది. కొందరు మంత్రుల అవినీతి ప్రవర్తన గురించీ అధికారదుర్వినియోగం గురించీ శాసనసభ్యులతో ఒక సెలక్ట్ కమిటీ విచారణ జరపాలని శాసనసభ కిందటి సమావేశంలో వీరిచ్చిన తీర్మాన ప్రతిపాదననోటీసుకు కాలదోషం పట్టినందువల్ల తిరిగీ నోటీసు ఇవ్వవలసివచ్చింది. నోటీసు ఇవ్వడం తడువు, కాంగ్రెస్ కార్యావర్గం నిర్మాణం ఇంకా అవుతూవున్న సమయంలోనే, ఈ మారు తప్పకుండా ప్రకాశంగారిపైన డిసిప్లినరీ ఆక్షన్ తీసుకు తీరతారని, అలా తీసుకోగలరని తమకు గాలికబుర్లు అందాయనీ కొందరు మంత్రులు పుకార్లు పుట్టించేశారు. నిజానికి వారికి అప్పటికి అందిన గాలికబురుగాని తంతికబురుగాని ఏమిటంటే వెంకట్రావుగారు మళ్ళీ కాంగ్రెస్ కార్యదర్శిగా నియమింపబడ్డారని మాత్రమే. ఆచిలవకు ఈపలవ పుట్టడానికి ఆట్టే సేపు పట్టలేదు.

[సీతారామ్]

# తమాషా ప్రశ్నలు

**గతవారం ప్రశ్నలకు జవాబులు:**

(1) తమ్ముడి పొలమే పెద్దది. తమ్ముడు పొలం 3 మైళ్లచదరం గనక, 3 మైళ్ల పొడుగు, 3 మైళ్ల వెడల్పూ వున్నది. అంటే 9 చదరపుమైళ్ల వైశాల్యం అన్నమాట. కాని అన్నపొలం 4 చదరపుమైళ్లే గనక అది చిన్నదే.

(2) మూడు బాతులు.

(3) ముందు రాముడు, భీముడు కలిసి బల్లకట్టుఎక్కి కాలవదాటారు. రాముడు మళ్లీ వెనక్కి వచ్చాడు. అప్పుడు వాళ్ల నాన్న ఒక్కడే బల్లకట్టు తోసుకుంటూ అవతలికి వెళ్లాడు. అక్కడ భీముడు బల్ల కట్టెక్కి ఇవతలికి వచ్చాడు. ఈసారి మళ్లీ రాముడు, భీముడు అవతలికి వెళ్లారు. రాముడు వెనక్కి వచ్చాడు. అప్పుడు పోస్టు బంట్రోతు ఒక్కడే కాలవని దాటాడు. భీముడు బల్లకట్టుని మళ్లీ వెనక్కి తెచ్చాడు. ఈ మాటు రాముడు, భీముడు కలిసి అవతలికి దాటారు.

---

## ప్రగతి (నాటికలు)

కర్త: ఆచార్య ఆత్రేయ.
ప్రకాశకులు: ఉదయసాహితి, గవర్నరుపేట, విజయవాడ.
వెల: ముప్పావలా.

ఈ గ్రంథంలో రెండు నాటికలున్నాయి' ఒకటి ఆత్రేయ విరచితం, "ప్రగతి," రెండవది హరీంద్రనాథచటోపాధ్యాయ విరచితం "కాపలావానిదీపం" రెండునాటికలూ అభ్యుదయ దృక్పథంతో కూడుకున్న ఊహాచిత్రాలే. రెంటిలోనూ వాస్తవికత లేదు.

"ప్రగతి" అనేనాటికలో సైంటిస్టూ, పెట్టుబడిదారూ, పిచ్చివాడూ, శాంతి మాత్రమే పాత్రలు. శాంతి సైంటిస్టు అక్క. శాంతి కొడుకు సత్యం యుద్ధంలో మరణించాడు. సైంటిస్టు అణుశక్తిని మించినమరో శక్తి కనిపెట్టాడు. దానిని కొనటానికి పెట్టుబడిదారు వస్తాడు. సైంటిస్టు శాంతి వచనాలు వినక చివరకు శాంతి చేతిలో మరణం పొందుతాడు. ఆత్రేయగారి సింబాలిజం ఎప్పుడూ రక్తిగానే ఉంటుంది. యుద్ధోన్మాదులను గురించి, వారికి తోడ్పడే పరిశోధనలను గురించీ ప్రచారం చెయ్యటానికి ఆత్రేయగారి నాటికను వినియోగపరచుకున్నారు. నాటికగా దీనికి నాట్యకళాపరిషత్తువారు ప్రథమ బహుమతి ఇచ్చి ఉన్నారు.

చటోపాధ్యాయగారి "కాపలావాని దీపం"లో మర్నాడు తెల్లవారి ఉరితీయబడనున్న కవీ, వర్తకుడూ, కార్మికుడూ మాట్లాడుకుంటారు. వా రెందుకు ఉరితీయబడుతున్నదీ ఈ సంభాషణ స్పష్టం చెయ్యదు. ఉరితీయబడటం విషయమై వారివారి చిత్తవృత్తులను చిత్రించటమే నాటకకర్త తన పనిగా పెట్టుకున్నాడు. ఇందులో కార్మికుడు అందరికన్న ఎక్కువ ధైర్యం ప్రకటించి భవితవ్యంగురించి ఆశ కనబరుస్తాడు. కవి చివరకు అతడితో ఏకీభవిస్తాడు. ఇందులో నాటకంకంటె కవిత్వం జాస్తి.

---

## ప్రసూతి - శిశుపోషణ

కర్త: డా. కొమర్రాజు అచ్చమాంబ.
ప్రకాశకుడు: శ్రీ. కె. వినాయకరావు, సూర్యరావుపేట, విజయవాడ
వెల: రు 2-8-0.

మన భాషలో వైజ్ఞానిక గ్రంథాలు చాలా తక్కువ. అందులోనూ అనుభవంగల ప్రవీణులు రాసిన గ్రంథాలు అరుదు. డాక్టరు అచ్చమాంబగారు అనుభవంగల ప్రవీణురాలే కాక మామూలు ప్రజల పరిస్థితులు గుర్తించి ఈ అమూల్యగ్రంథం రచించారు. ఇది విశేష ప్రజాదరణ పొందటానికి నిదర్శనంగా మూడవ ముద్రణం ఇప్పుడు వెలువడింది. ఇది ఇంటింటా ఉండదగిన పుస్తకం' పిల్లలను కని పెంచే ప్రతి తల్లీ తెలుసుకోదగిన విషయా లెన్నో ఇందులో ఉన్నాయి.





ఏనుగుమీంద దర్బారుకు వేంచేసిన ఢిల్లీ పాదుషాకు మంత్రిగారి స్వాగతం.

# భారతదేశపు సాలభంజికా ప్రదర్శనాలు

మంత్రితో అంతరంగిక సమావేశానికి దర్బారునుంచి బయలుదేరిన పాదుషా



Regd. No. M. 4479

# ఆంధ్రపత్రిక

## సచిత్ర వారపత్రిక

# ఫిలిం సంచిక



నవంబరు 8వ తేది దీపావళి నాడు ఆంధ్ర సచిత్ర వారపత్రిక ప్రత్యేక ఫిలిం సంచికగా వెలువడ గలదని మా పాఠకులకు తెలియజేయు సంతసించుచున్నాము.

ఆర్టుపేపరుమీద అందమైన త్రివర్ణ ముఖచిత్రముతోను, తెలుగు ఫిలిం పరిశ్రమకు సంబంధించి వివిధ విషయములగురించి సుప్రసిద్ధ రచయితలయొక్కయు, ఫిలిం పరిశ్రమలో ఉన్న ప్రముఖులయొక్కయు ప్రత్యేకవ్యాసములతోను, ప్రఖ్యాత ఫిలిం తారల, డైరెక్టర్ల, ప్రొడ్యూసర్ల, చిత్రములతోను, ఈ సంచిక విషయసమగ్రమైనదై, సర్వాంగ సుందరముగ వెలువడుచున్నది.

క్రౌన్ క్వార్టో సైజున 100 పేజీలు.

## వెల ఒక రూపాయి మాత్రమే

చందాదారులకు ఈ మేరకు చందా గడువు తేది సవరింపబడును.

మీ సమీపమున ఉన్న మా న్యూస్ ఏజంటువద్దగాని, మాకు వ్రాసిగాని మీ ప్రతిని వెంటనే రిజర్వు చేసికొనుడు.

ప్రతిసినిమా తారకు, ప్రొడ్యూసరుకు, టెక్నీషియనుకు, డిస్ట్రిబ్యూటరుకు, అసంఖ్యాకులైన ఫిలిం అభిమానులకు చేరు ఈ ప్రత్యేక సంచిక వ్యాపార ప్రకటనలకు అమూల్యమైనది.

---

### ప్రకటన రేట్లు :

| | | |
|---|---|---|
| మూడు రంగులలో | పేజి 1-కి | రు. 150/- |
| ఒక రంగులో | ,, | రు 100/- |
| ,  ,, | అర పేజీ | రు 60/- |
| ,,  ,, | పావు పేజీ | రు 35/- |

మానేజరు.

Edited, Printed & Published by S. Sambhu Prasad, at the Andhra Patrika Press, 7, Thambu Chetty St., Madras.